# వీక్షణం

*veekshanam fortnightly*

ఆర్థిక, సామాజిక పక్షపత్రిక

సంపుటి: 1 సంచిక: 21 | సమతా పబ్లికేషన్స్ ప్రచురణ | అక్టోబర్ 16-31, 2004

గౌరవ సంపాదకులు:
ఎ.బి.కె.ప్రసాద్

సంపాదకులు:
వి.హనుమంతరావు

సలహా మండలి:
ప్రొ॥ ఆర్.వి.ఆర్.చంద్రశేఖరరావు
ప్రొ॥ వకుళాభరణం రామకృష్ణ
ప్రొ॥ చక్రధరరావు
కాత్యాయని
బి.సాంబశివరాజు
ఎన్.వేణుగోపాల్

**లోపలి పేజీల్లో...**



విడి ప్రతి: రూ॥ 6/-
వార్షిక చందా:రూ॥140/-లు

సంపాదకీయం:

## చర్చలు కొనసాగాలి

కమ్యూనిస్టు (మావోయిస్ట్) పార్టీ, జనశక్తి ప్రతినిధులతో మొదటివిడత చర్చలు ముగిసాయి. రెండో విడత చర్చలు జరుగుతాయా, జరగవా, జరిగితే ఎపుడు అనేది ఈ నెలాఖరున జరగబోయే మంత్రిమండలి సమావేశంలో నిర్ణయిస్తామని ముఖ్యమంత్రి ప్రకటించారు. నాలుగురోజుల చర్చల్లో హోంశాఖమంత్రి జానారెడ్డి చూపిన సంయమనం నక్సలైట్ నాయకుల సంతృప్తిని చూరగొనగా, విశాఖ, విజయనగరం జిల్లాల పర్యటనలో ముఖ్యమంత్రి చేసిన ప్రకటన నక్సల్ నాయకులనుంచి అందుకు విరుద్ధమైన స్పందనను ఆహ్వానించింది. ఎన్నికల్లో చేసిన వాగ్దానాల మేరకు ప్రభుత్వం నక్సల్ నాయకులను చర్చలకు ఆహ్వానించగా నక్సలైట్లు వెంటనే అంగీకరించటం, చర్చలు పారంభం కావటం శుభ సూచకం. పోలీసులు, మోకాలడ్డుపెడుతున్న, కొంతమంది మేధావులు ఆయుధ ధారణ విషయాన్ని అవసరమైన దానికన్నా సాగలాగి చర్చలను భగ్నం చేయాలని ప్రయత్నించినా హోంశాఖమంత్రి జానారెడ్డి శ్లాఘనీయమైన పరిణతిని చూపిస్తూ, ప్రశాంతంగా చర్చలు కొనసాగించటం ప్రజలకు ఆశాజనకమైన సంకేతాలనందించింది. కాని ముఖ్యమంత్రి ప్రకటనలు ఆ ఆశలను నిరాశ చేసే సూచనలు కనుపిస్తున్నాయి. ఇది గ్రామాల్లో చంద్రబాబు పరిపాలన నాటి పరిస్థితులు పునరావృతం కావటానికే దారితీస్తుంది. ఇది పోలీసులకు శుభవార్త . ప్రజలకు అశుభవార్త. అదే జరిగితే, గ్రామాల్లో అభివృద్ధి కార్యక్రమాలు ప్రారంభించడానికి ఆటంకం ఏర్పడుతుంది. ప్రజా ప్రతినిధులు గ్రామాలకు వెళ్ళటం బంద్ అవుతుంది. బీడుపడివున్న భూముల్లో వ్యవసాయాన్ని పునరుద్ధరించటం అసాధ్యమవుతుంది. ఎన్‌కౌంటర్లు, చంపడాలు మళ్ళా జన జీవితంలో చోటు చేసుకొంటాయి. ప్రజలు భయంభయంగా బతుకులు సాగించాల్సి వస్తుంది. ఏకాగ్రతతో అభివృద్ధి కార్యక్రమాల మీద దృష్టి పెట్టి పని చేస్తున్న ముఖ్యమంత్రి తన దృష్టిని కొంతమేరకు ఈ పరిస్థితి వైపు మళ్ళించాల్సి వస్తుంది; ఆ మేరకు అభివృద్ధి కార్యక్రమాలు నష్టపోతాయి. దీనంతటికీ నక్సలైట్లు ఆయుధాలు జమ్మిచెట్టు కింద వదిలిపెట్టి రాక పోవటమే మూల కారణం అంటున్నారు. అందుకనే ఆ విషయాన్ని ఎజండాలో చేర్చి పరిష్కరించుకొందామని ఇరు పక్షాలు అంగీకరించాయి. ఈ విషయం చర్చల్లో పరిష్కారం అవ్వాలంటే రెండోవిడత చర్చలకు ఎటువంటి విఘాతం కలగరాదు. రాష్ట్రంలో శాంతియుత పరిస్థితులు కొనసాగడానికి ఇది అవసరం. దేశంలో ఈ సమస్య నెదుర్కొంటున్న రాష్ట్ర ప్రభుత్వాలు ఈ చర్చల ఫలితాన్ని గురించి ఆసక్తితో ఎదురు చూస్తున్నారు. కాగా ఆ రాష్ట్రాల్లో పరిస్థితులో క్షీణించకుండా వుండాలంటే కూడా ఈ చర్చలు కొనసాగాలి.

**వచ్చే సంచిక ఫోకస్: స్వావలంబన**

# ప్రపంచీకరణ-1

ప్రపంచం అంతా పెద్ద గ్రామం. ఏ దేశం వారైనా ఏ శానికైనా వెళ్ళి వుండవచ్చు; వ్యాపారం చేసుకోవచ్చు. వ్యాపారానికి ంబంధించినంతమటుకు దేశాల మధ్య సరిహద్దులనేవి వుండవు: ండకూడదు. ఎగుమతులు, దిగుమతులూ స్వేచ్ఛగా జరిగిపోతాయి. క దేశంనుంచి మరో దేశానికి డబ్బు యథేచ్ఛగా తీసుకొనిపోవచ్చు. బ్బ, ఎంత స్వేచ్ఛ, ఎంత హాయి!

ప్రపంచీకరణ అంటే ఇంతే అయితే, ఎందుకు యపడిపోతారు? ఇదీ ప్రపంచ పెట్టుబడిదారులు, అభివృద్ధి చెందిన శాలు, వారి కనుసన్నల్లో నడిచే ఐ.ఎం.ఎఫ్., ప్రపంచబ్యాంకు, బ్ల్యు.టి.వో., సంస్థలు ప్రపంచీకరణకిచ్చే నిర్వచనం. ఇదేనయ్యా, న పురాణాలు కూడా చెప్పేది; సర్వమానవ సౌభ్రాతృత్వం, ర్వమానవ కళ్యాణం, సర్వే జనః సుఖినో భవంతు అని కాషాయ ాజకీయవాదులు తమ నిర్వచనాన్ని జోడించి, తమ ప్రపంచీకరణ నుకూలతను సమర్థించుకొన్నారు. సరళీకరణ, ప్రయివేటీకరణ, ంస్కరణలు- ఇవన్నీ దాని అవతారాలే. ఈ మెట్లన్నీ ఎక్కేస్తే, పపంచీకరణకు చేరి పోతాం. ఇప్పటికే వచ్చేసిన స్వతంత్రంతో లమున్కలయిపోతున్న మనం ఇక ప్రపంచీకరణ కూడా వచ్చేస్తే, ంకేముంది, మనం అంతా నిగడదన్ని హాయిగా పడుకోవచ్చునని అనుకొంటున్నారా?

**ప్రపంచీకరణ సిద్ధాంతం**

పెట్టుబడిదారీ ప్రపంచం ఈ నినాదాన్ని నిన్నా, ఇవాళా కొత్తగా సృష్టించిందేమీకాదు; ఇదేమీ కొత్త విషయమూ కాదు. 19వ శతాబ్దంలోనే మార్క్సు మహాశయుడు తన మానిఫెస్టోలో పరిణామాన్ని వూహించి ఇలా అన్నారు: "తన ఉత్పత్తులకోసం నిరంతరం విస్తరించే మార్కెట్ బూర్జువా వర్గానికి అవసరం. ఆ అవసరమే బూర్జువా వర్గాన్ని భూమండలం మీ అంతటికీ తరుముతుంది. అది తన గూడు ప్రతీ చోటా పెట్టుకోవాలి; ప్రతీచోటా స్థిరపడాలి: ప్రతీచోటుతోనూ సంబంధాలు నెలకొల్పుకోవాలి".

పెట్టుబడిదారీ సమాజంలో సహజంగా ఏర్పడే అసమానతలవల్ల, సొమ్ము కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతమౌతుంది. అంటే గుత్త పెట్టుబడిదారీ విధానం రూపుదిద్దుకొంటుంది. తమ తమ దేశాలను పీకలదాకా అభివృద్ధి చేసుకొంటారు. అయినా, ఇంకా పెట్టుబడి వాళ్ళ చేతుల్లో పోగుపడుతుంటుంది. ఏం చెయ్యాలి? ఇతర దేశాలలో ఆ డబ్బును పెట్టుబడి పెట్టాలి: లాభాలు సంపాదించాలి. ఇక్కడే పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాద రూపం సంతరించుకొంటుంది. సామ్రాజ్యవాదుల సామ్రాజ్యవాద కాంక్షయే, ప్రపంచంలో మార్కెట్లను కబళించాలనే లక్ష్యమే మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలకు దారి తీసింది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం ప్రపంచ వ్యాపితంగా జాతీయోద్యమాలు ఉవ్వెత్తున లేచి సామ్రాజ్యవాదులను, వారి విస్తరణ వాంఛను వెనక్కు తిప్పికొట్టాయి. పాత పద్ధతుల్లో తమ పాలనను కొనసాగించలేమని సామ్రాజ్యవాద దేశాలు గమనించాయి. కొత్తగా స్వాతంత్రం సంపాదించిన దేశాల పాలకవర్గాలను బుట్టలో వేసుకొని ఆ పాలకవర్గాల ద్వారా తమ దేశాల్లోని పెట్టుబడిదారుల ప్రయోజనాలను కాపాడడానికి, విస్తరించడానికి నడుం బిగించారు. విదేశాల్లో పెట్టుబడులు పెట్టి, దేశాల సహజవనరులను పయోగించుకొని పరిశ్రమలు స్థాపించి, లాభాలు, డివిడెండ్లు రూపంలో తమ తమ దేశాలకు తరలించుకపోవడంతో ప్రారంభమైంది. ఈ విషయాన్నే లెనిన్ ఇలా విశదీకరించారు. "గుత్త పెట్టుబడులు పెరగడంతో సామ్రాజ్యవాదం ఆగమనంతో పెట్టుబడి ప్రపంచీకరణ వేగంగా ముందుకు సాగింది".

ప్రతీ దేశంలో గుత్తపెట్టుబడులు బలపడగా, అంతర్జాతీయంగా బహుళజాతి సంస్థలు తమ ఆర్థిక సామ్రాజ్యాలను విస్తరించుకొంటూపోయాయి. ఈ నేపథ్యంలో మన దేశంలో ఈ కార్యక్రమం సరళీకరణతో ప్రారంభమైంది. ప్రపంచీకరణ వినా అభివృద్ధి చెందుతూన్న దేశాలు ముందుకు పోవడానికి మరో మార్గం లేదని పత్రికలు, ప్రభుత్వ నేతలు చెవినిల్లు కట్టుకొని అదే పనిగా మన తలకాయల్లోకి ఎక్కించడానికి ప్రయత్నిస్తున్నారు. అటు ప్రపంచ ఆర్థిక సహాయ సంస్థలు (సహాయం అంటే ఆ సంస్థల పరిభాషలో 12.5 వడ్డీతో రుణ ఇవ్వడం) ప్రభుత్వ నాయకుల మెదడు తినేస్తున్నారు. మొత్తం మీద మెదడుని తొలిచేయడమే ప్రపంచీకరణ చేసినట్లు కనపడుతుంది. ప్రపంచ సంస్థలు మేం రుణం ఇచ్చాం అంతే అంటూ వచ్చి మన దేశాన్నే ఆర్థికంగా ఆక్రమించారు. అపుడు కొన్ని సంస్థానాల రాజులు, మహారాజులు ఎలా సామ్రాజ్యవాదులకు ఏజెంట్లుగా పనిచేసారో, ఇవుడు ఏకంగా దేశాధిపతులనే,

ర్పాష్టాధిపతులనే తమ గులాములుగా చేసుకొని, ప్రత్యక్షంగా ప్రపంచ సంస్థలే పరిపాలిస్తున్నాయి. కేంద్రంలో, ఇటు రాష్ట్రంలో బిజెపి, తెలుగుదేశం ఈ సంస్థలకు పాదసేవలు చేస్తున్నాయి. ఇలా ఒక్క మన దేశంలోనే కాదు. ఈ ప్రపంచ సంస్థలు అనేక వర్ధమాన దేశాలను భ్రష్టు పట్టించాయి.

వర్ధమాన దేశాలన్నీ మారక విలువ తగ్గింపు, డీరెగ్యులేషన్, డిఫ్లేషన్, డీనేషనలైజేషన్, డీసబ్సిడైజేషన్ అంశాలుగా గల నూతన ఆర్థిక విధాన పాకేజీని అమలు పరిచాయి. ఇలా చేసి, వ్యవస్థాగత మార్పులు తీసుకొని వస్తే, ఆ మార్పుకు మానవతా రూపాన్ని సంతరిస్తే, ఆ దేశాలు అభివృద్ధి మార్గాన పయనించగలవని, విప్లవాత్మక మార్పులు వచ్చేస్తాయని, ఒక చరిత్రనే సృష్టించగలవని దేశాలను, దేశాల నేతలను ప్రపంచ సంస్థలు ఎక్కవేశాయి. ఆర్థికంగా వర్ధమాన దేశాలు అభివృద్ధి చెందడానికి వ్యవస్థాగత మార్పులు తీసుకొని రావడం తప్ప మరో మార్గం లేదన్నాయి. కండపుష్టి, వీర్యవృద్ధి అంటూ మందుల గురించి అడ్వర్టయిజుమెంట్లతో మందుల కంపెనీలు కొంతమందిని ఎలా మోసం చేస్తాయో, ఈ ప్రపంచ సంస్థలు కూడా వారి విధానాన్ని గురించి ప్రచారం చేసి, ఆర్థికంగా ఇబ్బందుల్లో వున్న వర్ధమాన దేశాల నాయకులను తమ ఉచ్చులోకి లాక్కొన్నాయి. మరికొన్ని దేశాల నాయకులు తెలిసి కూడా ఆ ఉచ్చులో తమంతట తావే చిక్కుకొన్నారు. (మన రాష్ట్ర ముఖ్యమంత్రిలాగ). ప్రపంచీకరణ వల్ల తరుగుదలే కాని, పెరుగుదల సాధించలేమని దేశంలో గత దశాబ్దపు పరిణామాలు తెలియచేస్తున్నాయి. కేవలం ఒక్క ఉద్యోగవసతి కల్పించడం అనే విషయాన్ని మాత్రమే తీసుకొంటే సరళీకరణ తర్వాత సంవత్సరాల్లో ప్రభుత్వ, ప్రయివేటు రంగాల్లో ఉద్యోగావకాశాలు కేవలం 0.8 శాతం చక్ర అభివృద్ధి (కాంపౌండ్ గ్రోత్ రేట్) మాత్రమే సాధ్యమైంది. ఉద్యోగాలు వచ్చిన తలకాయలు లెక్క వేయగా 1996-97/1997-98 మధ్య కాలంలో 0.3 శాతం తగ్గింది. గమనించాల్సిన విషయమేమంటే స్థూల జాతీయాదాయం పెరిగింది కాని ఉద్యోగావకాశాలు తగ్గాయి. "దీన్ని బట్టి గ్రహించేదేమంటే, ప్రపంచీకరణ వల్ల ఉన్నతాదాయ వర్గాలే, ఉన్నతమధ్య తరగతి వర్గాలే వ్యవస్థాగత మార్పుల ఫలితాలను అనుభవించగలుగుతున్నారు" ఆర్థిక విధానాన్ని అంతర్జాతీయం చేసి, వర్ధమాన దేశాలమీద రుద్దడంతో, ఆ దేశాలు తమ జాతీయార్థిక విధానాలను రూపొందించుకోలేక పోయాయి. ప్రపంచ ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త మైఖేల్ చేసుడోవిస్కీ "ప్రపంచ ఆర్థిక సహాయ సంస్థల విధానాలను అమలుపరచిన నూరు వర్ధమాన దేశాల్లో పరిశీలించగా పేదరికం అంతర్జాతీయమైంది; జీతాల పెరుగుదలను తొక్కి పెట్టారు" అని అన్నారు. యుగోస్లావియాలో ఈ మార్పులు చేయడం వల్ల "అభివృద్ధి మందగించింది. విదేశీ రుణాలు పెరిగాయి; ముఖ్యంగా సేవల ఖరీదు పెరగడం, వారి నాణాల విలువ తగ్గించుకోవడం వల్ల, ప్రజల జీవన స్థాయి పడిపోయింది" అని ఆయనే అన్నారు. టాంజానియాలో ఆర్థిక శాస్త్రవేత్త సి.ఎస్.ఎల్.చాచాగే పరిశీలించగా ఈ విధానాన్ని అమలు పరచడం వల్ల రైతాంగం ప్రయోజనాలు దెబ్బతిన్నాయే గాని బాగుపడలేదని, పేదలు మరింత నిరుపేదలు కావడమే కాక, కాస్త తెల్ల చొక్కాలు వేసుకోగలిగిన వారు కూడా పేదరికపు రేఖ కిందకు జారిపోయారని పేర్కొన్నారు.

ప్రపంచ సంస్థల విధానాన్ని అధ్యయనం చేసిన విప్లవ దాస్ గుప్త "వ్యవస్థాగత మార్పులు ప్రవేశపెట్టడం వల్ల దారిద్రం, నిరుద్యోగం, జీతాల తగ్గింపు, ఆరోగ్యం విద్యలకు ఖర్చు తగ్గిన పరిస్థితులు ఏర్పడ్డాయి. సామాజిక సేవలకు కేటాయింపులు తగ్గించడం, సబ్సిడీల కోత, ద్రవ్యోల్బణం వల్ల నిజవేతనాల కోత" జరిగిందని అభిప్రాయం వ్యక్తం చేశారు. వివిధ అధ్యయనాలే కాదు, స్వయంగా ప్రపంచ బ్యాంకు 80వ దశకంలో జరిగిన వ్యవస్థాగత మార్పులను పరిశీలించి "ప్రజలు తినే ఆహారంలో కేలరీలు స్తంభించిపోయాయి, లేదా తగ్గిపోయాయి. ప్రభుత్వ కార్యక్రమాలను తగ్గించడం వల్ల, ఆరోగ్యం, తదితర సేవలను ప్రయివేటీకరణ చేయడం వల్ల పేదలు దెబ్బతిన్నారు" అని అంగీకరించింది.

జమైకాలో వచ్చిన పరిణామాల గురించి ప్రపంచబ్యాంకు చేసిన అనేక అధ్యయనాల్లో సంస్కరణలు తీవ్ర ప్రతికూల ప్రభావాన్ని కలిగించాయని, ప్రపంచబ్యాంకు జరుగుతాయని చెప్పిన దానికి విరుద్ధంగా సామాజిక-ఆర్థిక రంగాల్లో నష్టం సంభవించిందని తేల్చి చెప్పింది. వ్యవస్థాగత మార్పుల వల్ల పేదరికంలో మునిగితేలుతున్న ప్రజానీకం పరిస్థితుల్లో గమనించదగిన మార్పులేమీ రాలేదని అన్నాయి. ప్రపంచబ్యాంకు నివేదిక వివిధ దేశాల కార్మికుల ఆదాయం గురించి సమాచారాన్ని పోల్చి చూడగా ఒకపక్క ప్రాన్స్‌లో, రెండవ పక్క సియోల్ జకార్తా, ముంబై, నైరోభీల్లో పనిచేసే బస్ డ్రయివర్ల ఆదాయాలను పోల్చి చూస్తే వారి ఆదాయాలు ఇప్పటికన్నా 35 సంవత్సరాలకు పూర్వం దగ్గిర దగ్గిరగా వున్నాయని కనుక్కొంది. 1995 ప్రపంచ అభివృద్ధి నివేదిక ప్రకారం పేదరికం, పేదల పరిస్థితి ప్రపంచీకరణ కాలంలో దిగజారిందని, "ప్రపంచంలోని 2.5 బిలియన్

కార్మికుల్లో, సగటు తలసరి ఆదాయం 0.695 డాలర్లు(1993లో) అని, ఒక బిలియన్‌కు పైగా కార్మికులు ఒక డాలర్ కన్నా తక్కువ తలసరి ఆదాయంతో సరిపెట్టుకొంటున్నారని" తెలిపింది.

1997 మానవాభివృద్ధి నివేదిక ప్రకారం పరిస్థితులు రోజు రోజూ దిగజారుతున్నాయంటూ "అదృష్టవంతులైన కొద్దిమందికే ప్రపంచీకరణ ఫలితాలు దక్కుతున్నాయి" అని చెప్పింది. ఇంకా ఏమందంటే "ప్రపంచంలోని అట్టడుగున వున్న అతి పేదరికంలో వున్న ప్రజల్లో 20 శాతంమంది ఆదాయం శాతం మొత్తం ఆదాయంలో 1960లో 2.3 శాతం నుంచి 1991లో 1.4 శాతానికి, 1997లో 1.1 శాతానికి తగ్గుతూ వచ్చింది; ఇంకా తగ్గుతూనే వుంది. అట్టడుగున వున్న 2 శాతం ప్రజలకు, అత్యంత ఉన్నత స్థానంలో వున్న 20 శాతం మంది మధ్య రేషియో పైన ఉదాహరించిన సంవత్సరాల్లో 30:1, 61:1, 78:1(1994లో)కు దిగజారిపోయింది".

అయితే 1997లో చైనా, ఇండియా, ఏషియన్ టైగర్స్ దేశాలు ప్రపంచీకరణ వల్ల కొంతలాభ పడినా, ఈ రోజున టైగర్స్ దేశాల ఆర్థిక పరిస్థితి కుక్కలు చింపిన విస్తరిలా తయారయిందని, భారతదేశం పరిస్థితి ప్రమాదపటంచున వుందని జస్టిస్ జీవన్‌రెడ్డి అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

అలాగే యు.ఎన్.డి.పి. 1997 నివేదిక ప్రకారం ప్రపంచంలోని 1.3 బిలియన్ పేదల్లో దక్షిణాసియా, తూర్పు ఆసియా, ఆగ్నేయాసియా, పసిఫిక్ దేశాల్లోనే 950 మిలియన్లున్నారు. ఆశ్చర్యకరమైన మరో విషయమేమంటే తూర్పు యూరోప్ దేశాల్లో, స్వతంత్రదేశాల కామన్‌వెల్త్(అంటే పూర్వపు సోవియట్ యూనియన్ రిపబ్లిక్ దేశాలు)లో గత దశాబ్దంలో పరిస్థితులు మరీ ఎక్కువగా దిగజారిపోయాయి. ఆదాయ దారిద్రం చాలా కొద్దిమంది మాత్రమే అనుభవిస్తుండగా, వారి సంఖ్య మొత్తం జనాభాలో మూడోవంతుకు పెరిగింది. రోజుకు నాలుగు డాలర్లకన్నా తక్కువ ఆదాయం సంపాదిస్తూ పేదరికపు రేఖ కిందనున్న ప్రజల సంఖ్య 19 కోట్లు".

1997 నాటి మానవాభివృద్ధి నివేదిక చాలా పాతది, ఆ తర్వాత పరిస్థితి బాగుపడిందని ఎవరైనా అనుకొంటే, వాళ్ళు పొరపడుతున్నారని 1999 నివేదిక స్పష్టం చేస్తుంది. అక్కడక్కడ కొన్ని వర్ధమాన దేశాల్లో కొన్ని వర్గాల్లో అభివృద్ధి గురించి ఆ నివేదిక ఎత్తి చూపించినా, అనేక ఇతర దేశాల్లో దీనాతిదీనమైన పరిస్థితులు ఆ చిరు అభివృద్ధిని కమ్మేసాయి. "ఇదివరకటికన్నా ఎక్కువమంది టీవీలు చూస్తున్నారు; టెలిఫోన్‌లో మాట్లాడుకొంటున్నారు. కాని, అదే సమయంలో అప్పటికే దేశాల్లో వున్న తేడాలు, అసమానతలు ఆయా దేశాల్లో, దేశాల మధ్య అంతరాలను మరింతగా ఎత్తి చూపిస్తూనే వున్నాయి" అని 1999 నివేదిక చెబుతూంది.

ఎవరో, ఏదో అన్నారని దూర తీరాలు పోవడమెందుకు? స్వయంగా మన ప్రధాని వాజ్‌పాయ్ ఆ మధ్యన మారిషస్‌లో మాట్లాడుతూ ప్రపంచంలో కార్పొరేషన్ల మెర్జర్లు, ఒక కార్పొరేషన్‌ను మరో పెద్ద కార్పొరేషన్ దిగమింగడం లాంటి పరిణామాన్ని పేర్కొని వాటి ఆర్థిక బలంతో వివిధ దేశాల రెగ్యులేటరీ అధికారాలను కుదించేశాయని, దేశాల మీద సవారీ చేస్తున్నాయని, వ్యక్తులు తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకొనే హక్కును అణచివేస్తున్నాయని ఆందోళన వ్యక్తం చేసారు. 250 సంవత్సరాల క్రితం అతి పేద దేశాలకన్నా అతి ధనవంతమైన దేశాలు అయిదు రెట్లు ధనవంతమైనవి కాగా, 1976లో మొజాంబిక్ కన్నా స్విట్జర్లాండ్ 52 రెట్లు ధనికమైందని, 1997 నాటికి ఈ తేడా 508 రెట్లు పెరిగిందని వెల్లడించారు. పై బృందం తమ పత్రంలో ఆఖరున వ్యాఖ్యానిస్తూ ఆర్థిక పరిస్థితి అభివృద్ధి చెందాలంటే ముందు దేశీయ మార్కెట్ పెంపొందడం ముఖ్యావసరం అని, విప్లవాత్మకమైన భూసంస్కరణలు, విద్య, వైద్య సేవల విస్తృతి గ్రామీణ పరిస్థితి మెరుగుదల స్థానిక మార్కెట్ పెరగడానికి దోహదం చేస్తాయని అంటున్నారు.

"ప్రపంచ ఆర్థిక వ్యవస్థలన్నీ పెనవేసుకపోతున్నాయి. మనం మడి కట్టుకుని కూర్చుంటే ఎలా? అని, గ్లోబలైజేషన్‌లో భాగస్వాములం కావాలని మన పాలకులు, కొన్ని పత్రికలు నిత్యం ప్రచారం చేస్తున్నాయి. ప్రస్తుతం ప్రపంచంలోని అన్ని దేశాలకు ఈ గ్లోబలైజేషన్ మాత్రమే సరైన మందని, ఈ విధానాల్ని వ్యతిరేకించటం అంటే అభివృద్ధిని అడ్డుకోవటమేనని కూడా ఈ ప్రచారం సాగుతున్నది.

ఐక్యరాజ్యసమితి అభివృద్ధి కార్యక్రమం(యు.ఎన్.డి.పి) ప్రచురించిన హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు 1997లో "గ్లోబలైజేషన్ వల్ల పేదరికం పెరిగిందని" పేర్కొన్నది. ఐక్యరాజ్యసమితి యొక్క వాణిజ్య మరియు అభివృద్ధి సంస్థ (UNCTAD) ప్రచురించిన వాణిజ్య మరియు అభివృద్ధి నివేదిక 1997 (ట్రేడ్ అండ్ డెవలప్‌మెంట్ రిపోర్టు) "పెట్టుబడిదారుల ఆదాయాలు పెరిగితే అవి మళ్లీ సమాజంలో నూతన పెట్టుబడులకు దారితీస్తాయని ఆ విధంగా మొత్తం అభివృద్ధి సాధించబడుతుందనే సిద్ధాంతాలు తప్పని లాభాలే పరమావధిగా సాగుతున్న ఈ మార్కెట్ ఆర్థిక వ్యవస్థలో అటువంటి

అభివృద్ధి కానరావటం లేదని, సంపద కొద్దిమంది వ్యక్తుల చేతుల్లో పోగుబడ్డుతున్నదని" పేర్కొనటం విశేషం.

ఆ గ్లోబలైజేషన్ ప్రభావం గురించి వివరిస్తూ పైన పేర్కొన్న డెవలప్‌మెంట్ రిపోర్టు "పెరుగుతున్న సంపద వెల్లువలో పెద్ద పడవలు తేలియాడుతుండగా చిన్న తెప్పలు, దోనెలు ప్రవాహపు వాలుకి కొట్టుకపోయి క్రమంగా మునిగిపోతున్నాయని" పేర్కొంది. అంటే ధనికులు విపరీతంగా లాభం పొందుతుండగా పేదలు తీవ్రంగా నష్టపోతున్నారని ఈ రిపోర్టు చెప్పింది. యుఎన్‌డిపి ప్రపంచ వ్యాప్తంగా సమాచారాన్ని సేకరించి ప్రపంచీకరణ ఎటువంటి దుస్థితికి దారి తీసిందో వివరిస్తోంది:

* ప్రపంచంలోకెల్లా ధనికులైన ముగ్గురి ఆదాయం 36 దేశాల ఆదాయం కన్నా ఎక్కువ.

* ప్రపంచంలోని అత్యంత సంపన్నులైన 200 మంది సంపదలో ఒక్కశాతం (అంటే 8 బిలియన్ డాలర్లు) ఖర్చు పెడితే ప్రపంచంలోని పసి పిల్లలందరికీ ఒక సంవత్సరంపాటు ఉచిత ప్రాథమిక విద్యను అందించవచ్చు.

* ప్రపంచంలో రూపొందుతున్న స్థూల జాతీయాదాయాల మొత్తంలో 86 శాతాన్ని కేవలం సంపన్నదేశాలలో నివశిస్తున్న 20 శాతం మంది ధనికులు సొంతం చేసుకుంటున్నారు. ఆ ఇరవై శాతం మంది చేతుల్లోనే ప్రపంచంలోని ఎగుమతి మార్కెట్లలో 82 శాతం, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల్లో 68 శాతం, ప్రపంచంలోని టెలిఫోన్లలో 74 శాతం వున్నాయి.

* ప్రపంచంలోని పేద దేశాలలోని అట్టడుగు 20 శాతం జనం చేతుల్లో ఈ పైన చెప్పిన వాటిలో ఒక శాతంకన్నా తక్కువ వున్నాయి. ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ ఏదో గొప్ప మార్పు సాధించబోతున్నదని, దాని వల్ల సమాజంలో సమానత్వం సిద్ధిస్తుందని, నాణ్యమైన సేవలు అందుతాయని మన పాలకులు ఊకదంపుడు ఉపన్యాసాలిస్తున్నారు. కంప్యూటర్ రంగంలో వచ్చిన మార్పుకు, ప్రపంచీకరణకు అసమానతకు వున్న సంబంధాన్ని నిశితంగా అధ్యయనం చేసిన మానవాభివృద్ధి నివేదిక ఈ కింది నిర్ధారణలు ప్రకటించింది.

* ప్రపంచమంతటా ఎన్ని కంప్యూటర్లున్నాయో, అమెరికాలో అంతకన్నా ఎక్కువ కంప్యూటర్లున్నాయి. ప్రపంచ జనాభాలో దక్షిణాసియా వాటా 23 శాతం కాగా ఇంటర్‌నెట్ వినియోగదార్లలో దక్షిణాసియా వాటా ఒక్కశాతం కన్న తక్కువ.

* ఇంటర్‌నెట్ వినియోగదారులు సాధారణంగా పురుషులు. 35 ఏళ్ళలోపు వారు. విశ్వవిద్యాలయ పట్టభద్రులు. ఉన్నతాదాయ వర్గానికి చెందినవారు. పట్టణంలో నివశించేవారు. ఇంగ్లీషు మాట్లాడేవారు ఒక్క మాటలో చెప్పాలంటే ఒక అత్యల్ప సంఖ్యాక ఉన్నత వర్గానికి చెందినవారు. ఈ అన్ని స్థాయిలలోను ఇంటర్‌నెట్ అసమానత కొనసాగుతున్నది.

* మొత్తం ప్రపంచంలో ఇంగ్లీషు మాట్లాడగల వాళ్ళ సంఖ్య పదిశాతానికన్న తక్కువ కాగా, వెబ్‌సైట్లలో 80 శాతం కన్నా ఎక్కువ ఇంగ్లీషులోనే వున్నారు.

* కొనసాగుతున్న అంతర్జాతీయ సంభాషణలో ఈ సమాచార సంబంధాలున్న వాళ్ళందరూ సన్నిహితంగా కలిసి ఉన్నారు. ఆ సంబంధాలు లేని పేద ప్రజానీకంకన్నా వారికి ఎక్కువ శక్తి వుంది. అవకాశాలున్నాయి. అందువల్ల ఆ పేద ప్రజల గొంతు వినిపించడం లేదు. వారి అవసరాలేమిటో తెలియడం లేదు.

**ఫైనాన్స్ కాపిటల్**

డబ్బుతో వ్యాపారం అంటే సరుకులు తయారుచేసి అమ్మడం, కొనడం, ఎగుమతులు, దిగుమతులు కాదు, డబ్బు తీసుకొని వచ్చి కర్మాగారాలు పెట్టడం అసలేకాదు. ఈ వ్యాపారంలో ఎగుమతి చేసేది డబ్బే. వందలు, వేలు, కోట్లు ఎంత కావాల్సి వస్తే అంత డబ్బు రకరకాలుగా వస్తుంది. పరిశ్రమల్లో తమకు ఇదివరకే ఉమ్మడి రంగంలో 40 శాతం పెట్టుబడి వుంటే, దానిని నూరు శాతం వరకూ పెంచుకోవడానికి భారత ప్రభుత్వం అనుమతించింది కాబట్టి ఆ మేరకు డబ్బు వస్తుంది. షేర్ మార్కెట్‌లో స్పెక్యులేషన్ కోసం డబ్బు వస్తుంది. విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకన్నా పోర్ట్‌ఫోలియో పెట్టుబడులు ఎక్కువగా పెరిగాయి. 1992 వరకూ విదేశీ పెట్టుబడులు పెట్టుబడి మార్కెట్‌లో, అంటే స్టాక్ ఎక్ఛేంజీలో అనుమతించేవారు కాదు. అంతవరకూ విదేశీ ప్రైవేటు పెట్టుబడులూ ప్రవాస భారతీయులు వగైరా పెట్టుబడులు వచ్చేవి. 93-94 వచ్చేసరికి విదేశీ ప్రైవేటు పెట్టుబడులు 620 మిలియన్ డాలర్లుంటే, పోర్ట్‌ఫోలియో పెట్టుబడులు 3493 మిలియన్ డాలర్లున్నాయి. కాని తర్వాత సంవత్సరంలో పోర్ట్‌ఫోలియో పెట్టుబడులు 3581 డాలర్లకు పెరిగాయి. అంటే, స్పెక్యులేషన్ కార్యక్రమాలకే విదేశీధనం ఎక్కువగా దేశంలో ప్రవేశించింది. మన ఉత్పత్తి పెరగడానికి, మన దేశాభివృద్ధికి తోడ్పడడానికి కాదు. దీనినే హాట్ మనీ అంటారు. ఈ హాట్‌మనీ దేశంలోకి ప్రవహించడం ఎంత వేగవంతమైందంటే, 1994లో ఈ హాట్‌మనీ మొత్తం విదేశీ మారకం

(మిగతాది 12వ పేజీలో)

# ప్రపంచీకరణ-2

ప్రపంచంలోని అన్ని దేశాలలో పాలకులు ప్రపంచీకరణ రామకోటి రాసేస్తున్నారు. వారితో పాటు ఆర్థిక శాస్త్రవేత్తలు, వ్యతిరేకంగా గాని, అనుకూలంగా గాని, ప్రపంచీకరణ అనే మాటను ఉచ్ఛరించని వారు లేరు. అదొక ఊతపదమై పోయింది. ఇక మరో మార్గం లేదు. మరో ప్రత్యామ్నాయం లేదనే భావనను కలుగజేశారు. ప్రపంచం ఎజండాలో ఇప్పుడొకే ఒక విషయముంది. అదే ప్రపంచీకరణ అదే ఈ శతాబ్దపు ఎజండా.

అమెరికా అధ్యక్షుడు బుష్ దృష్టిలో ప్రపంచీకరణ అంటే ప్రపంచ దేశాలన్నింటినీ తన పాదాక్రాంతం చేసుకోవటం. ఇతర పెట్టుబడి దేశాలు, ముఖ్యంగా యూరోపియన్ దేశాలకు ప్రపంచీకరణ అంటే వ్యతిరేకం కాదు కాని, దానికి ఔనని అంటే తమను అమెరికా హాంఫట్ చేస్తుందేమోనని భయం. అమెరికా, దాని తాబేదారీ సంస్థలు ప్రపంచబ్యాంకు, ఐ. ఎం. ఎఫ్, డబ్ల్యు.టి.వో ఆసియా దేశాల్లోని పాలక వర్గాలపై ప్రయోగిస్తున్న రాజకీయ, ఆర్థిక ఒత్తిడులను తట్టుకోలేక ప్రపంచీకరణకు తలలు వంచుతున్నారు. సామ్రాజ్యవాదం అంతరించింది. పెట్టుబడిదారీ విధానం పెత్తనం సాగించి, ఇపుడు ఆర్థిక సామ్రాజ్యవాదంగా రూపుదిద్దుకొంది. ఆర్థిక సామ్రాజ్యవాదులకు, వారికి దన్నుగా నిలుస్తున్న బహుళజాతి సంస్థలకు వారి ఉత్పత్తులను అమ్ముకోవడానికి మార్కెట్లు కావాలి. అభివృద్ధి చెందుతున్న దేశాలకు ఈ ఉత్పత్తులు కావాలి. కాని వాటిని కొనుక్కోవడానికి డబ్బులేదు. ఆర్థిక సామ్రాజ్యవాదులు డబ్బును ఎరవేసి, ఆదేశాలను తమ మార్కెట్లుగా మార్చుకొని, దోచుకొంటున్నారు. దీనికి పెట్టిన ముద్దుపేరే ప్రపంచీకరణ. ఈ విధానం వల్ల దేశాల సరిహద్దులు చెరిగిపోతాయి. ఏదేశమైనా, ఏదేశానికైనా యధేచ్ఛగా ఎగుమతులు చేసుకోవచ్చు. అలా ఎగుమతి చేసిన వస్తువుల మీద కస్టమ్స్ సుంకాలు నామమాత్రంగానే విధించాలి. ఇది ఆచరణలో ఎలా అమలు జరుగుతుందో, అది అభివృద్ధి చెందిన దేశాలను వర్థమాన దేశాలకు స్వేచ్ఛగా ఎగుమతి చేయడానికేగాని, ఇటునుంచి అటు కాదని తెలుసుకోవాలి. వర్థమాన దేశాలు అభివృద్ధి చెందాలంటే ఇదొకటే మార్గం అని అభివృద్ధి చెందిన దేశాలంటున్నాయి.

ఈనాటి పాలకుల ఆలోచన ప్రకారం ప్రపంచమంతా ఒక పెద్ద గ్రామం అంతర్జాతీయ వ్యాపారం, పెట్టుబడి, టెక్నాలజీ, సమాచారం - వీటన్నిటినీ ప్రపంచ విపణిలో వ్యాపారానికి పెట్టారు. ఇదివరకు పెట్టుబడిదారీ విధానం అంటే ఆయాదేశాల్లో ఉత్పత్తి చేయటం, లాభాలు పోగేసుకోవటం, ఆ దేశ మార్కెట్‌మీద గుత్తాధిపత్యం సాధించటం. కాని ఇపుడు దేశాల ఎల్లలు చెరిపివేసి, అవే కార్యక్రమాలను విశ్వవ్యాపితంగా నడిపిస్తున్నారు. కేవలం నడిపించడమే కాదు " ప్రపంచీకరణ అనేది అతి సహజమైన పరిణామం అది వచ్చేస్తుంది, వచ్చేసింది " - ఇదీ పాలకుల ఆలోచన, ఆచరణల తీరు. ఈ ఆలోచనను ప్రపంచంలో అందరి ఆలోచనగా మార్చివేయడానికి నిరంతర కృషి జరుగుతోంది. విశ్వవ్యాపితంగా వున్న 37వేల బహుళజాతి సంస్థలు WB, IMF, WTO లాంటి అంతర్జాతీయ ద్రవ్యసంస్థలు ఈ ప్రచార పల్లకీ ఎక్కి దేశ దేశాన ప్రజల్ని ఎంతగా ఊదరగొడుతున్నారంటే, ఊపిరి సల్పకుండా మన మనస్సుల్లో ముద్రవేయడానికి ప్రయత్నిస్తున్నారంటే, ఇది తప్ప మరోమార్గమేమి లేదనే అభిప్రాయానికి ప్రజల్ని నెట్టుతున్నారు. అయితే ఇదేమీ కొత్తవిషయం కాదు. ఫ్యూడలిజంనుంచి పెట్టుబడిదారి విధానానికి మారినపుడు ఆ విధానంలో ఆధునికీకరణ, పారిశ్రామికీకరణ లాంటి ప్రక్రియలను చేపట్టినప్పుడు కూడా అవి అవసరం, అభివృద్ధికి ఆ విధానాలు మినహా మరో మార్గం లేదనే ప్రచారం జరిగింది. అదే ప్రచారం ఇపుడు ప్రపంచీకరణ గురించి సాగుతోంది. పెట్టుబడిదారీ విధానాన్ని అనేక దేశాలు అమలు పరుస్తున్నప్పుడే, అది వినా మరో దిక్కులేదని అంటూన్న సమయంలోనే దానికి ప్రత్యామ్నాయంగా సోషలిస్టు వ్యవస్థ ఆవిర్భవించింది. 70 సంవత్సరాలు కొనసాగింది. ఆ శకం అంతరించిందంటే అది ఆ విధానంలో లోపం వల్ల కాదు. అది అమలు పరచిన పద్ధతిలో లోపం వుండటం వల్లనే అది తెరమరుగైంది. దీనితో ఏకధృవ ప్రపంచం ఏర్పడింది; పెట్టుబడిదారీ విధానాన్ని ఉచ్ఛదశకు తీసుకొని వెళ్లిన బహుళజాతి సంస్థలు పేట్రేగిపోయాయి. తమకు అడ్డులేదనుకొన్నారు. ప్రపంచదేశాలమీద విరుచుకపడి ప్రపంచీకరణే మార్గమన్నారు. మరో మాటల్లో చెప్పాలంటే రాజకీయ సామ్రాజ్యవాదం ఆర్థిక సామ్రాజ్యవాదం రూపంలో ప్రపంచం అంతా వూరేగుతోంది. అభివృద్ధి చెందిన దేశాలు ప్రపంచంలో పల్లకీ ఎక్కి వూరేగుతుంటే వర్థమాన దేశాల్లోని పాలక వర్గాలు ఆ పాటనే పాడుతూ, పల్లకీ బోయీలుగా పనిచేస్తున్నాయి. పల్లకీ మోసేవారు 'ఓయ్ ఓయ్ ' అంటారే, అలాగే వీరుకూడా.

ప్రపంచంలో సోషలిస్టు వ్యవస్థ ఆవిర్భవించిన తర్వాత, సామ్రాజ్యవాదులు పాత పద్ధతిలోనే తమ దోపిడీని కొనసాగించడానికి బదులు, ప్లేటు మార్చి, అందరికీ ఉద్యోగం, ఆరోగ్యం, విద్య లాంటి సామాజిక సంస్కరణలతో పెట్టుబడిదారీ విధానం యొక్క దోపిడీతత్వానికి ముసుగువేసి వేషం మార్చి తన వ్యవస్థ కొనసాగింపుకు ఏర్పడ్డ అవరోధాన్ని తొలగించుకొంటూ వచ్చింది. వేషం మారింది కాని, గుణం కాదు కదా.

ప్రస్తుతం దేశ పాలకులు, వారి తాబేదారులైన ఆర్థిక నిపుణులు మార్కెట్ ఎకానమీ విధానానికి వింజామరలు విసురుతున్నారు. విదేశీ ఉత్పత్తులను తలుపులు బార్లా తెరిచారు. కస్టమ్స్ సుంకం తగ్గిస్తూ వస్తున్నారు. 1600 వస్తువుల మీద ప్రపంచ వ్యాపార సంస్థ ఆ దేశం మేరకు పరిణామాత్మక ఆంక్షలు తొలగించారు. ఏదేశమైనా తన ఉత్పత్తులనే ఏ ఇతర దేశంలోకి అయినా ఎటువంటి ఆంక్షలు లేకుండా ఎగుమతి చేసి అమ్ముకోవచ్చు. అయితే నోరున్నవాడిదే రాజ్యం అన్నట్లు, అభివృద్ధి చెందిన దేశాలు తమ మీద తామిచ్చే రుణ సహాయం మీద ఆధారపడి బతికే దేశాలు చేసే ఎగుమతులను పలు రకాలుగా నిరోధిస్తూ, అదే సమయంలో తమ ఎగుమతులను వర్ధమాన దేశాల మీద రుద్దుతున్నారు. తమ ఉత్పత్తులకు మార్కెట్లను విస్తరించుకొంటున్నారు. ప్రపంచీకరణకు ఇది మొదటి మెట్టు. మార్కెట్‌ను ఆక్రమించుకొన్న తర్వాత ఆ దేశ ఆర్థిక విధానాలపై పెత్తనం సంపాదిస్తాయి. ఆదేశంలోకి దిగుమతులేగాని ఎగుమతులుండవు. నూరుశాతం విదేశీ పెట్టుబడులు దేశ పారిశ్రామికరంగాన్ని శాసిస్తాయి. ఇలా దేశం తర్వాత దేశాన్ని కబళించటమే అమెరికా లక్ష్యం. ఈ లక్ష్య సాధనకు ప్రపంచబ్యాంకు, ఐ.ఎం.ఎఫ్., ప్రపంచ వ్యాపారసంస్థ నమ్మిన బంటులా వ్యవహరిస్తున్నాయి. ప్రపంచీకరణ అంటే ఇదే. ఇదే నేడు మన దేశంలో జరుగుతుంది. ప్రపంచీకరణకు పునాదులు మన దేశంలో ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టినపుడే పడ్డాయి. ప్రయివేటీకరణ, ద్రవ్యసంస్థలు, సంస్కరణలు, విదేశీ పెట్టుబడులకు ప్రవేశం- ఇవన్నీ ఆర్థిక సంస్కరణల్లో భాగమే.

ప్రభుత్వరంగ పరిశ్రమల్లో ప్రభుత్వ గుత్తాధికారాన్ని అంతం చేయడం, సమర్థవంతంగా పని చేయించడం, పోటీ వాతావరణాన్ని సృష్టించటం ప్రయివేటీకరణల లక్ష్యాలు. కాని ఆచరణ ? ప్రభుత్వరంగ పరిశ్రమలను ఎవరుకొంటున్నారో చూడండి. ప్రయివేటు రంగంలో ఇప్పటికే కార్పొరేట్ స్థాయికి చేరుకొని గుత్త పెట్టుబడులకు అధిపతులైన వారే వీటిని కొని స్వాధీనం చేసుకోగలుగుతున్నారు. అంటే ప్రభుత్వ గుత్తాధిపత్యం పోయి ప్రయివేటు గుత్తాధిపత్యం వస్తుందన్న మాట. ఎడమచెయ్యి తీసి పుర్ర చెయ్యిపెట్టమన్నట్లుందీ వ్యవహారం. గత పది సంవత్సరాల కాలంలో దేశంలో ప్రయివేటు గుత్తాధిపత్యాన్నే బహుళజాతి సంస్థలు పలహారం చేసేస్తున్నాయి. ఉమ్మడి యాజమాన్యంలో వున్న పరిశ్రమల్లో నుంచి దేశీయ వాటాదారును తొలగించి తమ ఈక్విటీని పెంచి, మొత్తం పరిశ్రమనే ఆక్రమించుకొంటున్నారు. ఉదహరణకు 1998 లో బ్రెజిల్ దేశంలో 47 బిలియన్ల విలువగల ఆ దేశ సంస్థలను అమెరికా, యూరోప్‌లోని బహుళజాతి సంస్థలను కొనివేశాయి. కొరియాలో అమెరికా పెట్టిన పెట్టుబడుల్లో 53 శాతం కొరియన్ జాతీయ సంస్థలను కొనివేయడానికి వుపయోగించారు. అభివృద్ధి చెందిన జపాన్ లాంటి దేశంలో బ్యాంకింగ్, ఫైనాన్షియల్ రంగాల్లోకి లోతుగా ప్రవేశించాయి. ఇదివరకు విదేశీ కంపెనీలు, తాము నేరుగా దేశంలోకి రాకుండా సబ్సిడీయరీలనుదేశంలో ఏర్పాటు చేసి పరోక్షపాత్ర వహించాయి. ఇపుడు ఆ సబ్సిడీయరీలను తీసేసుకోవటం ద్వారా పారిశ్రామిక రంగాన్ని మెల్లమెల్లగా తమ చేతుల్లోకి తీసుకొంటున్నారు పెద్ద పెద్ద కంపెనీలు ఇతర పెద్ద కంపెనీలను కొనేయటం, లేకపోతే రెండు పెద్ద కంపెనీలు కలిసి పోవటం వల్ల (మెర్జర్) పోటీ పెరుగుతుందా? అమ్మేస్తున్న ప్రభుత్వ రంగ సంస్థలను ఎవరు కొంటున్నారో చూస్తే ఇది అవగతమవుతుంది. ఈ అమ్మకాల్లో టేబుల్ కింద నుంచి ఎంత డబ్బు ఎవరి చేతుల్లోకి, జేబుల్లోకి పోతుందో గత సంవత్సరం మన రాష్ట్రంలో కొన్ని పరిశ్రమలను కారుచవుకగా అమ్మేయటంలో జరిగిన లావాదేవీలే. తిరుగులేని సాక్ష్యం. ప్రభుత్వరంగం నుంచి పరిశ్రమలు నిష్క్రమించాయి గాని, ప్రయివేటు జేబులు నిండాయి. లంచగొండి తనం హద్దుల్లేకుండా పెరుగుతోంది. కుక్కను చంపాలంటే దాన్ని పిచ్చి కుక్క అనమన్నట్లు ప్రభుత్వ రంగ పరిశ్రమను అమ్మేయాలంటే, దానిని అసమర్థంగా నడిపించు, నష్టాల్లోకి నెట్టు, నష్టాలు పెరిగిపోతున్నాయని కేకలు పెట్టు, ప్రజల్లో ఈ పరిశ్రమలపట్ల ప్రతికూల ప్రచారాన్ని జోరుచేయ్, అవుడు అమ్మకం సులువవుతుంది-ఇదీ ప్రభుత్వాల ఎత్తుగడలు.

ఆర్. టి. సి. లో ప్రస్తుతం ఇదే జరుగుతుంది. కోట్ల రూపాయల పెట్టుబడి పెడతాం, ఉద్యోగావకాశాలను కల్పిస్తాం, సమర్థవంతంగా నడిపిస్తాం అని ప్రజల మనసులను ప్రభావితం చేస్తారు. నిజానికి ఆ ప్రయివేటు పార్టీలు తమ సొంత డబ్బేమీ తీసుకొని రావటం లేదు; రారు. బ్యాంకులు, ఆర్థిక సహాయ సంస్థల నుంచి డబ్బు తీసుకొని వస్తారు. నష్టమొస్తే పోయేది బ్యాంకు డబ్బే. అంటే మీ, మా డబ్బు ఇప్పటికే ఈ ప్రయేటు సంస్థలు రు. 1.25ల. కోట్లమేరకు బ్యాంకులు మొండి బాకీల్లో చేరిపోయాయి. ఇపుడు మరింతగా పెరుగుతాయి. ఈ ప్రయివేటీకరణ దేశాభివృద్ధికి తోడ్పడదని, ఏం చేస్తే ఈ ప్రభుత్వ రంగ సంస్థలు ఒడ్డున పడి మళ్లా లాభాల బాటలో పడతాయో, గత పది సంవత్సరాలుగా అనేక సూచనలు వచ్చాయి; వాటినీ బుట్ట దాఖలు చేసి, ప్రయివేటీకరణ మినహా మరోమార్గం లేదన్నారు. ప్రపంచబ్యాంకు, దాని వెనుకనున్న అమెరికా ఈ పరిణామాన్నే కోరుకొంటుంది. మన పాలకులు గంగిరెద్దులా తలూపుతున్నారు. ప్రపంచీకరణకు పలు మార్గాల్లో పయనిస్తూ, అభివృద్ధి చెందిన దేశాలు కమ్ముకొస్తున్నాయి.

అలాగే వ్యవసాయం మీద ఆర్థిక సామ్రాజ్యవాదులు కన్ను పడింది. కార్పొరేట్ వ్యవసాయాన్ని ప్రవేశపెట్టడం ద్వారా, విదేశాల్లో ప్రజలకు అవసరమైన వ్యవసాయోత్పత్తులను మన దేశంలో

(మిగతాది-10వ పేజీలో)

# ప్రపంచీకరణ-3

రావణాసురులు, బకాసురులు, కుంభకర్ణుల్లాంటి శాల్తీల గురించి పురాణాల్లో చదివిన మనం బోలెడంతఆశ్చర్య పోతుంటాం. పిల్లలు గుడ్లప్పగించి, నోరింత చేసుకొని వింటారు. బకాసురుడు గుండిగల తర్వాతగుండిగలు తిండి హాంఫట్ చేసాడని చదివి వాడిది కడుపా, బానా అని అనుకొంటాం. నేటి బహుళజాతి సంస్థలు కూడా ఆ కోవలోకి చెందిన వారేనని చెబితే, ఆ సంస్థలను చిన్న బుచ్చినట్లవుతుంది. పైన ఉదహరించిన శాల్తీలన్నీ ఏదో ఒక విషయంలో, అంటే తినటంలోనో, నిద్రపోవటంలోనో, రాక్షసత్వంలోనో పెద్దన్నయ్యలు మాత్రమే. కాని ఈ బహుళజాతి సంస్థలున్నాయి (సంస్థలు అని ఉదహరిస్తా) చూశారూ, వీళ్లలో పైన ఉదహరించిన అవలక్షణాలన్నీ కలిసి వుంటాయి. అలాంటి వాళ్లనేమని పిలవాలో చెప్పాలంటే నా భాషా పరిజ్ఞానం చాలదు. ప్రపంచం అంతటినీ తమ గుప్పెటలో పెట్టుకోవాలి అన్ని దేశాల మార్కెట్లను తామే వశం చేసుకోవాలి; ఈ విశ్వాన్నంతటినీ తామే పరిపాలించాలి. ప్రపంచంలోని సహజ వనరులన్నీ తమకే కావాలి. అవసరమైతే ఆయాదేశాల అధిపతులను హతమార్చాలి; లొంగకపోతే, బాంబులవర్షం కురిపించి ఆ దేశాలను, ప్రజలను నేలమట్టం చెయ్యాలి. అయితే, ఈ సంస్థలు తమ వ్యాపారమే చేసుకొంటారా పై పనులన్నీ చేస్తుంటారా ? వీళ్లకు తీరిక వుండదు కాబట్టి, ఈ పనులు చేసి పెట్టడానికి అమెరికాను, అలాగే కొన్ని అగ్రరాజ్యాల అధినేతలను ఎంచుకొన్నారు; ఈ పనులన్నీ ప్రజాస్వామ్యం అనే గొడుగు కింద జరగాలి కాబట్టి వాళ్లు అవసరమయ్యారు. అవసరమయ్యారు అనే దానికన్నా ఇద్దరూ తోడిదొంగలై దేశాలకు దేశాలనే కబళించడానికి ప్రణాళికలు రూపొందించుకొన్నారంటే వాస్తవానికి దగ్గరగా వుంటుంది. ప్రపంచబ్యాంకు, ఐ.ఎం.ఎఫ్; ప్రపంచ వ్యాపార సంస్థ లాంటి ఏజెంట్లను నియమించారు. ఈ సంస్థల దగ్గర డబ్బు మూలుగుతుంది; వర్ధమాన దేశాల దగ్గర డబ్బులేదు. వాళ్ల ఉత్పత్తులు వారి అవసరాలకు మించి వున్నాయి వాటిని అమ్ముకోవాలి. దానికి మార్కెట్లు కావాలి. మీకు అప్పు ఇస్తాం, అయితే మా సరుకులను మీ దేశంలో అమ్ముకోనివ్వాలి అన్నారు. దీనికో ప్రజాస్వామ్య ముసుగు కావాల్సి వచ్చింది.

అదెలా వేసారు అనేది అదో పెద్దకథ. ఆ కథ చెప్పాలంటే బండిగాడి తప్పుతుంది. ఈ మార్కెట్లన్నిటినీ భోం చేసి ప్రపంచంలో అన్ని దేశాల్లో ఈ సంస్థల జండా ఎగురవేయడానికి మరోపేరే ప్రపంచీకరణ. దేశాలు, ఎల్లలు అన్నీ దాటి ఎవరు ఎవరి దేశంలోనైనా సరే, ఎటువంటి ఆంక్షలు, అడ్డంకులు లేకుండా ఏదైనా, ఎంతకైనా అమ్ముకోవచ్చు. ఈ ప్రణాళిక పేరే ప్రపంచీకరణ. ఈ ప్రణాళి వెనుకనున్న సంస్థల బలం ఎంతవుందో చెబితే మీ కళ్లు తిరిగిపోతాయి.

పూర్వంలా సరుకులు ఎగుమతి చేసి అమ్ముకోవటంతోనే సరిపెట్టుకోకుండా, అక్షరాలా డబ్బునే ఎగుమతి చేసి, వర్ధమానదేశాల్లో స్పెక్యులేషన్ చేస్తున్నారు. ఇలా ప్రపంచంలో ప్రతీరోజూ ప్రదక్షిణం చేస్తున్న స్పెక్యులేటివ్ కాపిటల్ ఒక ట్రిలియన్ డాలర్లు. డాలరుకు 50 రూపాయలనుకొంటే, ట్రిలియన్ డాలర్లు అంటే 5000000,00,00,000లు. 50 లక్షలకోట్ల రూపాయలు తిప్పుతున్నారు. ఈ సంస్థల్లో అందరికన్నా పెద్ద నోరున్న మూడు సంస్థల ఆస్తుల విలువ, ప్రపంచంలో కన్నా అతి పేద దేశాలన్నిటి స్థూల జాతీయాదాయం కన్నా ఎక్కువే. వీళ్లలో కేవలం 400 కుంటుంబాల ఆస్తి విలువ మనదేశం స్థూల జాతీయాదాయం కన్నా రెట్టింపు వుంటుంది. మన గ్రామాల్లో గట్టిగా ఓ పాతిక ఎకరాలైనా లేని భూ ఖామందు కూడా గ్రామ ప్రజలందరి జీవితాలమీద తిరుగులేని పెత్తనం చెలాయిస్తాడే, అలాంటిది ఇన్ని లక్షలకోట్ల రూపాయలున్న వాళ్లుమొత్తం ప్రపంచం అంతటిమీద దాష్టీకం చేయటంలో ఆశ్చర్యపోవాల్సిన పనిలేదు. ఒక పక్క రాజకీయాధికారం, రెండోపక్క ధనబలం రెండూ కలిసి వర్ధమాన దేశాల మార్కెట్లమీద, వాటి సహజ వనరుల మీద, వారికున్న టెక్నాలజీ ఆధిక్యతతో దాడి చేస్తుంటే, వారు విజయం సాధిస్తున్నారంటే మన పాలకుల్లో ఎవరో TROJAN HORSES లా పని చేస్తున్నారన్న మాట. వాళ్ల చేతులకు మట్టి అంటకుండా, నిప్పుల్లో పప్పులేరి పెట్టే దగుల్బాజీ లెవరో మనలోనే వున్నారని అనిపించడం లేదూ ?

వాళ్లు మనకు ఒక డాలర్ సహాయం (అప్పుకు పెట్టిన ముద్దుపేరు) చేస్తే, మనం రెండు డాలర్లు తిరిగి చెల్లిస్తున్నామని 'ఆక్స్‌ఫామ్' అనే ప్రముఖ అంతర్జాతీయ పరిశోధన సంస్థ లెక్కలు వేసి చెప్పింది. వాళ్లు మనలాంటి దేశాల్లో పెట్టుబడులు పెడితే అంతకు ఎన్నోరెట్లు లాభాలు, డివిడెండ్లు, జీతాలు, అలవెన్సుల పేరుతో వాళ్ల దేశాలకు మళ్లుతున్నాయి. వారు కుబేరులవుతున్నారు. 1970లో ఏడువేల బహుళజాతి సంస్థలుంటే అవి రెండువేల

సంవత్సరం నాటికి 63వేలకు చేరుకొన్నాయి. ఇవి కాకుండా వాళ్ల సబ్సిడియరీ సంస్థలు, వాటితోపాటు ఆయాదేశాల్లో పారిశ్రామిక వేత్తలతో ఒప్పందాలున్నాయి. ఈ 63 వేలల్లో చిన్న చితకా సంస్థలూ, అంటే మన దేశంలో చిన్నా, చిట్టీ పరిశ్రమలున్నాయే అలాంటివి. వీళ్లల్లో మరీ పెద్ద పొట్ట, నోరు వున్న ఒకవంద సంస్థలను పరిశీలిస్తే వారి రెవెన్యూ 2000 సంవత్సరంలో 6.6 ట్రిలియన్లున్నాయని వెల్లడైంది. ఇది ఎంతటితో సమానం అంటే ప్రపంచంలో మరీ ధనవంతమైన పది దేశాలను మినహాయిస్తే, మిగతా 180 దేశాల స్థూల జాతీయాదాయం కన్నా ఎక్కువే. డబ్బుంటే ఎంత అసాధ్యమైనా సాధ్యం చేయవచ్చునని అనుకొనే ఈ రోజుల్లో, ఇంత డబ్బు అధికారం ఉన్నవాళ్లు ఏమైనా చేయగలుగుతారు.

అమెరికాలో 'ఫార్చ్యూన్' అనే పత్రిక ప్రతీ సంవత్సరం ప్రపంచంలో 500 అత్యధిక ఆదాయం గల కార్పోరేషన్ల పట్టికను ప్రచురిస్తుంది. ఈ 500 బహుళజాతి సంస్థల్లో 1856 అమెరికాలోనే వున్నాయి. ఆ తర్వాత 104 కార్పోరేషన్లలో జపాన్ రెండవస్థానం ఆక్రమిస్తుంది. ఈ రెండు దేశాలు కలిసి 58శాతం కార్పోరేషన్లకు జన్మనిచ్చాయి.

2000 సంవత్సరంలో ఈ 500 కార్పోరేషన్ల మొత్త రెవెన్యూ ఆదాయం 1,40,64,960 మిలియన్ డాలర్లు. (మిలియన్-10లక్షలు; డాలర్ ప్రస్తుత మారకం ధర రు. 48లు.) ఇంత ఆదాయం వస్తున్నపుడు వాళ్ల లాభాలు కూడా అదే స్థాయిలో వుంటాయి. ఈ 500 కార్పోరేషన్ల ఆస్తులు 4.1 శాతం పెరిగితే ఆదాయం 2000 సంవత్సరంలో 10.8 శాతం, వారి లాభాలు 20.4 శాతం పెరిగాయి. ఒక్క ఎక్సాన్‌మోబిల్ (అన్నిటిలో కన్నా పెద్ద చమురు కంపెనీ) లాభాలే 127 శాతం పెరిగాయి. ఇలాంటి కంపెనీల లాభాలు ఏ స్థాయిలో వుంటాయో, కాస్త రుచి చూడాలి.

**2000లో ప్రపంచ కార్పోరేషన్ల లాభాలు**

(మిలియన్ డాలర్లు)

| | |
|---|---|
| ఎక్సాన్‌మోబిల్ | 17720 |
| సిటీ గ్రూపు | 13519 |
| జనరల్ ఎలక్ట్రిక్ | 12735 |
| రాయల్ డచ్/షెల్ గ్రూపు | 12719 |
| బి.పి. | 11870 |
| వెరిజాన్ కమ్యూనికేషన్ | 11797 |
| ఐ ఎన్ జి గ్రూపు | 11075 |
| ఇంటెల్ | 10535 |
| మైక్రోసాఫ్ట్ | 9421 |
| రాయల్ ఫిలిప్స్ | 8874 |

(ఫార్చ్యూన్ జూలై 23, 2001)

హైటెక్నాలజిల్లో 90శాతం కన్నా ఎక్కువగా బహుళజాతి సంస్థలు గుప్పిట్లోవున్నాయి. మళ్లా ఫార్చ్యూన్ పత్రిక ప్రకారం అమెరికాలో ఒకే ఒక వ్యక్తి జెరోమ్ లెమల్సన్ చేతిలో 358 పేటెంట్లు వున్నాయి. ఈ పేటెంట్లను లైసెన్సుదారులకిచ్చి 1.5 బిలియన్ డాలర్ల ఆదాయం సంపాదిస్తాడు.

ఈ సంస్థలు సాంప్రదాయక వస్తువుల ఉత్పత్తిలో గుత్తాధిపత్యం చేస్తూనే, సరికొత్త రంగాల్లో (నీరు, పారిశుధ్యం, విద్య వగైరా) కూడా గుత్తాధిపత్యం సాధిస్తున్నారు. ఉపాధి పెరుగుదల రేటుకన్నా, వారి రెవెన్యూ లాభాలు మరింత వేగంగా పెరుగుతున్నాయి.

ప్రభుత్వరంగం కన్నా ప్రయివేటు రంగమే శ్రేష్టమనే అభిప్రాయం చాలా మందిలో వుంది. ప్రభుత్వమే ఈ ప్రచారాన్ని లంకించుకొంది. కంచే చేనును మేస్తుంది. అనేక వాదనల్లో ముఖ్యమైనదేమంటే ప్రయివేటురంగం తక్కువ మందితో పని చేయించుకోగలుగుతుంది. అంటే తక్కువ మందితో ఎక్కువ పని చేయించుకోవటం లేదా వారిశ్రమను దోచుకోవటం శ్రేష్టమన్నమాట. అదే సంవత్సరం లెక్కల ప్రకారం ప్రపంచవ్యాపితంగా ఈ 500 కార్పోరేషన్లు వాటి అనుబంధ సంస్థలు కలిపి 470 లక్షల మందికి మాత్రమే ఉద్యోగవసతి కల్పించగా, ప్రభుత్వరంగ సంస్థలు 4350 లక్షలమందికి (సుమారుగా 10 రెట్లు) ఉద్యోగాలివ్వగలిగింది. పరిశ్రమ పెడుతున్నారంటే ఉద్యోగాలు దొరుకుతాయని యువతఆశిస్తుంది. ఈ ఆశను ప్రభుత్వరంగం తీర్చగలుగుతుందని పై గణాంకాలు నిరూపిస్తున్నాయి. ప్రయివేటు రంగానికెపుడూ ఎంతమందిని ఉద్యోగాలనుంచి తొలగించి మిగిలిన వారిమీద పనిభారం పెంచి మరిన్ని లాభాలు చేసుకోవాలనేదే తపన. ఉదహరణకు జనవరి-జూన్ 2001 మధ్య కేవలం ఆరునెలల కాలంలోనే కేవలం ఒక్క టెలికాం రంగంలోనే 293 వేలమందిని ఉద్యోగాలనుంచి తొలగించారు. అమెరికాలో సెప్టెంబరు 11 ఉగ్రవాదుల దాడి తర్వాత ఒక్క సెప్టెంబరు నెలలోనే రెండు లక్షల ఉద్యోగాలు గాలిలో కలిసిపోయాయి. అయినా, ప్రయివేటు రంగమే కావాలని అనుకొంటున్నారా?

విదేశీ పెట్టుబడితో మనలాంటి దేశాల్లో పరిశ్రమలు స్థాపిస్తున్నారంటే శెట్టి వరదను ఊరకనే కొట్టుకొని పోడన్నట్లు, వాళ్లు ఊరకనే రావటం లేదు; మనలాంటి దేశాలను ఉద్ధరిద్దామనీ కాదు. ఇలాంటి దేశాల్లో తక్కువ జీతాలకు కార్మికులు లభిస్తారని, తమకున్న రాజకీయ పలుకుబడితో, వర్ధమాన దేశాల పాలకులమీద ఒత్తిడి తీసుకొని వచ్చి, తమకనుకూలమైన విధానాలు అవలంబించేలా

చేసుకోగలమనే విశ్వాసంతో, తమ తమ దేశాల్లో ఉత్పత్తి వ్యవస్థను వర్ధమాన దేశాలకు తరలిస్తున్నారు. ఏ ఉత్పత్తిరంగంలో అయితే ఎక్కువ కార్మిక శక్తిని వుపయోగించి సరుకులు ఉత్పత్తి చేయాలో (LABOUR INTENSIVE), ఆ ఉత్పత్తి కార్యక్రమాన్నే వర్ధమాన దేశాలకు ఎగుమతి చేస్తున్నారు. అదే సమయంలో అలా పరటాయించిన పరిశ్రమల్లో ఆటోమేషన్, సబ్-కాంట్రాక్టింగ్‌లాంటి పద్ధతులవలంబించటం ద్వారా, ట్రేడ్ యూనియన్ల సంఘటిత శక్తిమీద దెబ్బ తీస్తున్నారు. ఒకపక్క ఇలా కార్మికుల జీవనోపాధి మీద దెబ్బతీస్తూ, మరొక పక్క తమ సంస్థల్లో ఉన్నత యాజమాన్య స్థానాల్లో వున్న వారికి ఎంతెంత జీతాలిస్తున్నారంటే 'ఫార్ట్యూన్' లాంటి పత్రిక కూడా ఈ ప్రక్రియను "దారి దోపిడి " గా పేర్కొంది. ఉదహరణకు ఆ పత్రిక ప్రకారమే ఆపిల్ కంప్యూటర్ సిఇవో స్టీవెన్ జాబ్స్‌కు 1999 సంవత్సరంలో ఇచ్చిన జీత భత్యాలు 5070 లక్షలడాలర్లు! ఆ స్థాయిలో పనిచేసిన వారికి సగటున సంవత్సరానికి 2740 లక్షల డాలర్లు ముట్టిందని ఆ పత్రికే గణాంకాలు ఇచ్చింది.

ఇలాంటి గణాంకాలతో (ఇవన్నీ కవల్జిత్‌సింగ్‌రాసిన "గ్లోబల్ కార్పోరేట్ పవర్ " అనే పుస్తకం నుంచి సేకరించబడ్డాయి) ఈ పత్రిక అంతా నింపివేయవచ్చు. అభివృద్ధి చెందిన దేశాలు, అక్కడే కేంద్రంగా పెట్టుకొని ప్రపంచవ్యాపితంగా తమ దోపిడీ కార్యక్రమాలను నిర్వహించుకోవడమే ప్రపంచీకరణ లక్ష్యం. ఇలాంటి దోపిడీని ఆహ్వానిస్తున్నారు పాలకులు.

బహుళజాతి సంస్థల కొండంత ఆర్థిక శక్తి గురించిన గణాంకాలు చూచిన తర్వాత, అమ్మబాబోయ్, వీళ్లను మనమెక్కడ ఆపగలం? ఏం జరగాలో అదే జరుగుతుంది బతికుంటే బలుసాకు తినవచ్చునని డీలా పడిపోనక్కర్లేదు. ఉత్తరకొరియా చాలా చిన్నదేశం. అయినా అమెరికాలాంటి దేశాన్ని పళ్లురాలగొట్టి, వెనక్కుతిప్పి పంపింది. సియాటిల్‌లో ప్రజాశక్తులు వేలాదిమంది గుమికూడి కొమ్ములు తిరిగిన ప్రపంచ పెట్టుబడిదారులను సమావేశం కూడా జరుపుకోనివ్వకుండా నిలువరించారు. తాజాగా, ఇరాన్ మీద యుద్ధానికి అమెరికా కాలు దువ్వుతుంటే కొన్ని నెలలుగా యుద్ధం జరక్కుండా ప్రపంచ ప్రజాభిప్రాయం అడ్డుకట్ట వేయగలిగింది.క్యూబా సంగతి అందరకూ తెలిసిందే. చరిత్ర ఇలాంటి ఉదహరణ లెన్నయినా ఇచ్చింది. కాగా దోపిడీ వర్గాలు ప్రపంచీకరణ కోరుతుంటే, మనమూ ప్రపంచీకరణకు తయారు కావాలి. అది ప్రజా ఉద్యమాల ప్రపంచీకరణ.



(7వ పేజీ తరువాయి)

పండించడం ద్వారా, మన దేశాన్ని తిండి గింజలకోసం విదేశాలపై ఆధారపడేలా ప్రయత్నం ఇప్పటికే ప్రారంభమైంది. వారి పన్నాగాలు ఫలిస్తే, మళ్లా తిండిగింజల దిగుమతులపై ఆధారపడాల్సిన రోజులు ఎంతో దూరంలో లేవు. ఈ విధంగా వ్యవసాయ మార్కెట్ మీద కూడా వారి పట్టును పెంచుకొంటున్నారు.

స్టాక్ మార్కెట్లలో ప్రవేశించారు. దేశంలో రాజకీయ ఆర్థిక పరిణామాలకు స్పందిస్తూ, స్టాక్ మార్కెట్లలో కొనుగోలు, అమ్మకాల ద్వారా, దానిని తమ ఇష్టం వచ్చినట్లు మలుచుకోగలిగే స్థానాన్ని సంపాదించారు.

గ్రామీణ మార్కెట్లలో కూడా ఎన్నడో ప్రవేశించారు. విదేశీ, కంపెనీలు, తమ ఉత్పత్తులను అర్ధరూపాయ, రూపాయ పాకెట్లలో అమ్మటం ద్వారా స్వదేశీ ఉత్పత్తులను మార్కెట్ల నుంచి నెట్టివేశారు.

ఇలా అభివృద్ధి చెందిన దేశాలను దోచుకొని, బహుళజాతి సంస్థలు తమ లాభాలను ఆదాయాలను ఎలా పెంచుకొంటున్నాయో, గణాంక వివరాలు చూస్తే గుండె గుభేలుమంటుంది. ఉదహరణకు 1993లో నూరు బహుళజాతి సంస్థలు తమ ఆదాయంలో 50 శాతాన్ని విదేశాలనుంచే సంపాదించాది. 1980 లో ఈ శాతం 27 శాతం వుండేది. ఒకసారి విదేశీ పెట్టుబడి వస్తే, వాళ్లకొచ్చే లాభాల్లో 50 శాతం అదే దేశంలో పెట్టుబడి పెడుతుండడం వలన, ఆ బహుళజాతి సంస్థే మెల్లగా తన పెట్టుబడిని పెంచుకొంటూ గుత్తాధిపత్యానికి నిచ్చెనలువేస్తుంది. ఇలా పెంచుకొంటూ పోగా వారి ఖాతాలో జమ అయ్యే పెట్టుబడిలో, వాస్తవంగా వారి దేశాన్నుంచి తెచ్చింది కేవలం ఆరుశాతం మాత్రమే (మనదేశంలో హిందూస్థాన్ లీవర్ కంపెనీలాగ). వీరి లాభాలు ఆదాయాలు ఇలా పెరుగుతూంటే, ఆక్రమించిన దేశాల్లో కార్మికుల ఆదాయాలు కొడిగట్టిక పోతాయి.

### జాతీయాదాయంలో కార్మికుల వేతనాల శాతం

| | 1970 | 1980 | 1985 | 1989 | 1992 |
|---|---|---|---|---|---|
| అర్జంటైనా | 40.9 | 31.5 | 31.9 | 24.9 | |
| ఛిలీ | 47.7 | 43.4 | 37.8 | | |
| ఈక్వెడార్ | 34.4 | 34.0 | 23.6 | 16.0 | 15.8 |
| మెక్సికో | 37.5 | 39.0 | 31.6 | 28.4 | 27.3 |
| పెరూ | 40.0 | 32.8 | 30.5 | 25.5 | 16.8 |

ఇపుడు దేశంలో ప్రపంచబ్యాంకు కోరినమేరకు తయారైన రెండవ లేబర్ కమీషన్‌కి సిఫార్సులను అమలుపరిస్తే, ఇదే జరుగుతుంది.

ఈ దోపిడీకి వ్యతిరేకంగా వివిధ దేశాల్లో ప్రజలు ఉద్యమాలైపు మొగ్గుతున్నారు. కొన్నిచోట్ల అవి సాయుధ పోరాటాలుగా, గెరిల్లా పోరాటాలుగా రూపొందుతున్నాయి. ఇవి ఏ మేరకు ఆ పంథాలో నడుస్తున్నాయనేది ఆయా దేశాల్లోని వామపక్షాల, ప్రజాస్వామ్య శక్తుల బలాబలాలపై ఆధారపడి వుంటుంది.



# ప్రపంచీకరణ-4

ప్రపంచపటం నుంచి సోవియట్ యూనియన్ అంతర్ధానమైపోవటం, చైనా మిన్నకుండిపోవటంతో, అమెరికా పట్టపగ్గాలు లేకుండా ప్రవర్తిస్తోంది. తన సమస్యను ప్రపంచ సమస్యగా చిత్రించి తన బాధను ప్రపంచీకరణ చేస్తోంది. రెండోపక్క చూస్తే అమెరికాలో టన్నులకు టన్నుల డబ్బు మూలుగుతోంది. బ్యాంకుల్లో, పెన్షన్ ఫండ్సులో, బహుళజాతి సంస్థల ఇనప్పెట్టెల్లో డబ్బే డబ్బు. ఆ డబ్బు పిల్లల్ని పెడితేనే గాని, అంతకు మరింత అయితే గాని తప్ప అమెరికాకు తోచదు. దేనికేనా ఫామిలీ ప్లానింగ్ ఉంటుంది. కాని డబ్బుకు కాదు కదా. అదెలా సాధ్యం? 1) ఆ డబ్బెక్కడైనా అప్పిచ్చి, వడ్డీ సంపాదించవచ్చు. 2) ఆ డబ్బుతో పరిశ్రమలు స్థాపించి లాభాలు సంపాదించవచ్చు. 3) దేశాలకు దేశాల మధ్య తంపులు పెట్టి, వాళ్ల పరిష్కారం చేసుకోకుండా తగవును ఎగదోస్తూ, ఇద్దరూ పీకల్దాకా సాయుధీకరణ చేసుకొంటూంటే, వాళ్లకు అమెరికాలోని యుద్ధ పరిశ్రమలు ఆయుధాలు తయారుచేసి సరఫరా చేస్తూ లాభాలు చేసుకోవచ్చు. ఆ విధంగా తన సమస్యను పరిష్కారం చేసుకోవాలంటే ఇతర దేశాల్లో సమస్యలు సృష్టించాలి. అంటే తన సమస్యను ప్రపంచీకరణ చేయాలి. ఇపుడు జరుగుతున్నదిదే. అలా జరగడానికి ప్రపంచంలో వివిధ దేశాల్లో నిప్పుల్లో పప్పులేరి పెట్టే వాళ్లు కావాలి. వాజ్‌పాయ్‌లు, చంద్రబాబుల లాంటి పాలకుల పాత్ర అదే.

ప్రపంచీకరణ వినా మరో మార్గం లేదని అమెరికా అంటూంటే అవునవునంటూ తందానతాన పాడుతున్నారు. పై మూడు పద్ధతులను మనదేశం మీద అమెరికా ప్రపంచబ్యాంకు, ఐ.ఎం.ఎఫ్, డబ్ల్యుటివో లాంటి సంస్థల ద్వారా ఎలా అమలు పరుస్తుందో కనపడుతూనే వుంది. సంస్కరణలు ప్రారంభించినపుడు 90 బిలియన్ డాలర్లుగా వున్న విదేశీరుణభారం నేడు సుమారు 120 బిలియన్ డాలర్లకు పెరగడం ఒక ఎత్తయితే, దానిమీద చెల్లించే వడ్డీలు మన ఆర్థిక వ్యవస్థనంతా తలకిందులు చేస్తున్నాయి. వడ్డీలు చెల్లించడానికి కూడా మళ్లా అప్పు చేయాల్సిన పరిస్థితికి నెట్టింది. రెండో పక్క ద్రవ్యలోటు తగ్గించుకోవాలని ఒత్తిడి చేస్తుంది. అది తగ్గించుకోవడానికి ప్రభుత్వ ఖర్చులు అంటే ఉద్యోగుల జీత భత్యాలు, ప్రభుత్వ ఖర్చులు, రక్షణ ఖర్చు తగ్గించుకోవాలి. అవి తగ్గించుకోలేక, సంక్షేమ పథకాల కేటాయింపుల మీద వేటువేస్తుంది. ఇందువల్ల అటు బడ్జెట్‌నూ సంబాళించుకోలేదు. ఇటు ప్రజల క్రోధాగ్నులనెదుర్కోవడం తప్పడం లేదు. ప్రభుత్వం బలహీనపడుతుంది. కాని కుర్చీలు వదల్లేరు. మళ్లా అమెరికావైపే చూస్తారు. ప్రపంచబ్యాంకుకు కావాల్సింది సరిగ్గా ఇదే. ఇదంతా ప్రపంచీకరణలో భాగం. అంటే దేశం ఆర్థిక దుస్థితిని ఎదుర్కోవటానికి ప్రపంచీకరణే కారణం. రెండవది పరిశ్రమలు స్థాపించి డబ్బు చేసుకోవటం. కాని పరిశ్రమలు పెట్టకుండానే డబ్బును రెండింతలు చేసుకోగలిగితే అంతకన్నా ఇంకేమి కావాలి ? అందుకోసం రెండు పనులు చేసింది. WTO ను సృష్టించి, దేశాలమధ్య వ్యాపారానికున్న అడ్డంకులను తొలగించేసుకొని, స్వేచ్ఛగా వారి ఉత్పత్తులను ఆ దేశాలకు ఎగుమతి చేసి, స్థానిక పరిశ్రమలను దెబ్బతీసి, మార్కెట్‌ను కైవసం చేసుకొంటూంది. ఇంత సులువు లాభాలు చేసుకోగలిగినపుడు, వచ్చి పరిశ్రమలెందుకు పెట్టాలి ? అలాగని పరిశ్రమలు పెట్టడం లేదని అనుకోవడానికీ వీలులేదు. వారి వారి దేశాల్లో కన్నా, వర్ధమాన దేశాల్లో చవకగా కార్మికశక్తి లభ్యత, రకరకాల మినహాయింపులు, ప్రోత్సాహకాల లభ్యతను బట్టి, పరిశ్రమలు స్థాపించి ఉత్పత్తి ఖర్చు తగ్గించుకొని, తిరిగి తమ దేశానికి ఎక్కువ ధరకు అమ్ముకొని లాభాలు సంపాదించవచ్చు. ఏ విధానాన్ని అవలంబించేది ఆయా దేశాల్లో పరిస్థితినిబట్టి నిర్ణయించుకొంటాయి. ఇలా చేయటం వల్ల ఆయా దేశాల స్వదేశీ పరిశ్రమలనూ అడ్డు తొలగించుకోవచ్చు; ఆ మార్కెట్లూ కాజేయవచ్చు. లాభాలూ సంపాదించవచ్చు. బహుళజాతి సంస్థల, ఆ సంస్థలకు కొమ్ముకాసే దేశాల ప్రపంచీకరణ నినాదం అసలు లక్ష్యం ఇది.

మూడవది దేశాల మధ్య ఆరని చిచ్చు రగిలించిందనడానికి భారత్-పాకిస్తాన్ యుద్ధ వాతావరణమే తిరుగులేని సాక్ష్యం. అమెరికా అటు పాకిస్తాన్‌తో, ఇటు భారతదేశంతో నత్సంబంధాలు పెట్టుకొంటున్నట్లే నటిస్తూ, తెర వెనుకనుంచి, ఇద్దరూ ఒకరిపీకలు మరొకరు కోసుకోవడానికి, యుద్ధ సన్నాహాలు చేయడానికి, అందుకు కావాల్సిన ఆయుధాలను సరఫరా చేస్తూ తోడ్పడుతూ, ఆ ఆయుధాలు తయారుచేసే అమెరికన్ సంస్థల లాభాలకు తోడ్పడుతూ, ఈ చేత్తో ఇచ్చే ఆర్థిక "సహాయం" మరో చేత్తో పరోక్షంగా తమ దేశానికే లాభాలతో సహా చేరేలా చూచుకొంటున్నారు. తామిచ్చిన ఆర్థిక "సహాయం" కు షరతులను తగిలించి రైతాంగాన్ని సబ్సిడీలు కోత, విద్యుచ్ఛక్తి, నీటిపారుదల ఛార్జీల పెంపు, ధరల పెరుగుదల, యూజర్ ఛార్జీల ద్వారా ఉత్పత్తి ఖర్చుల భారాన్ని పెంచి, కిట్టుబాటు ధర లభించక, అయినకాడికి అమ్ముకోవాల్సిరావటంతో, చేసిన అప్పులు తీర్చలేక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారంటే, మరోవైపు కార్పోరేట్ వ్యవసాయాన్ని ప్రవేశపెట్టించి, సన్న, చిన్న కారు రైతులను రిక్షాలాక్కొని బతకాల్సిన పరిస్థితికి నెట్టుతున్నారంటే అదంతా ప్రపంచీకరణ వల్లనే కదా. ఇక కార్మికులు, మధ్య తరగతి ఉద్యోగులకు మళ్లా అదే ప్రపంచబ్యాంకు షరతులమేరకు 1) యాజమాన్యాలకు హైర్ అండ్ ఫైర్ అధికారం 2) కాంట్రాక్టు లేబరు పద్ధతి ప్రవేశ పెట్టడం, 3)పదుల సంవత్సరాల పోరాటాలతో,

బలి దానంతో సాధించుకొన్న సౌకర్యాలు, హక్కులు అన్నింటినీ ఉపసంహరించడం, 4) డౌన్‌సైజు, రైట్‌సైజు అనేక రకాల పేర్లతో, ఉద్యోగుల సంఖ్యను తగ్గించటం 5) కాజువల్ లేబర్ పద్ధతి విస్తృతంగా ప్రవేశపెట్టడం, 6) పనిభారాన్ని పెంచటం, 7) నిరుద్యోగుల సంఖ్యను VRS ద్వారా పెంచడం. 8) ఉద్యోగంలో ఉన్న వారికి జీతాలు తగ్గించటం ఇవన్నీ కొన్ని ఉదహరణలు మాత్రమే. క్లుప్తంగా చెప్పాలంటే ఉద్యోగంలో వున్న వాడికి రక్షణ లేదు; లేని వాడికి ఉద్యోగ వసతి కల్పించే ప్రశ్న లేదు. ఇవన్నీ ప్రపంచీకరణ దుష్ఫలితాలే. ఇలాంటి ప్రపంచీకరణను బలపర్చాలట. ఈ ప్రపంచీకరణకు వ్యతిరేకంగా ప్రజల తిరుగుబాటు కొనసాగుతుంది. చలి చీమలచేత చిక్కిచావ వలసినదే అని వేమన పద్యం గుర్తుకు వస్తుంది. ఒక వ్యాస రచయిత ఎం. శ్రీనివాస్ అన్నట్లు "ఈ ప్రజా ప్రతిఘటన తొలుత 1999 డిసెంబర్‌లో అమెరికాలో సియాటిల్‌లో పాదుకొల్పింది. తరువాత అది దావోస్ మొలకెత్తింది. వాషింగ్టన్‌లో రెమ్మలేసింది. ప్రాన్, మెల్బోర్న్‌లలో మొగ్గ తొడిగింది. 'నీస్' జూరిచ్, క్యూబెక్‌లలో పుష్పించింది. బార్సిలోనా, గోథెన్‌బర్గ్ నగరాల్లో కాయ కాసింది. జెనీవాలో పండుగామారే క్రమానికి శ్రీకారం చుట్టింది" వరదలా పొంగి పొరలి వస్తున్న ప్రజా వాహిని తాకిడికి ఎంతటి మహా వృక్షమైనా నేలకూలక తప్పదు.



(5వ పేజీ తరువాయి)

మొత్తంలో 37.5 శాతం వుండగా, ఫిబ్రవరి 98లో 78.80 శాతానికి పెరిగిపోయింది. అంటే ఇంత శాతం విదేశీ మారకం నిల్వలు ఏ నిముషంలోనైనా మన దేశంలోనుంచి బయటకు పోవచ్చు. ఇదే మళ్ళీ 1991 పరిస్థితే దేశంలో పునరావృతమౌతుంది. ప్రభుత్వాలకు డబ్బు అప్పు రూపంలో వస్తుంది. అభివృద్ధి చెందిన దేశాల్లో వడ్డీరేటు నాలుగు శాతం మించి వుండదు కాబట్టి, ఎక్కడ ఎక్కువ వడ్డీ వస్తే అక్కడకు ఈ డబ్బు ప్రవహిస్తుంది. (గత సంవత్సరం రిసర్జెంట్ బాండ్స్, ఈ సంవత్సరం స్టేట్ బ్యాంకు మిలీనియం బాండ్స్‌ల్లో పెట్టుబడికి హెచ్చువడ్డీ హామీతో ప్రవాసభారతీయులు బాండ్లు కొన్నారు). అభివృద్ధి చెందిన దేశాల్లో పెన్షన్ ఫండ్స్, మ్యూచువల్ ఫండ్స్ లాంటి వ్యవస్థాగత సంస్థలున్నాయి. ఉదహరణకు పెన్షన్ నిధులు 1989లో 4.3 ట్రిలియన్ డాలర్ల నుంచి 1994 నాటికే ఏడు ట్రిలియన్ డాలర్లకు పెరిగాయి. అంతర్జాతీయంగా ఈ నిధులు పెట్టిన పెట్టుబడులూ 1994 నాటికి 790 బిలియన్ డాలర్లకు పెరిగాయి. ఇంత డబ్బు వడ్డీలకు తిప్పుతుంటే, వర్ధమాన దేశాలనుంచి పెట్టుబడి దారి దేశాలకు డబ్బు ఎలా, ఎంత మోతాదులో తరలివెళుతుందో వూహించుకోవచ్చు. ఇదివరకు వ్యాపార బ్యాంకులు అప్పులిచ్చేవి. ఆ అప్పులు ఇపుడు తగ్గుముఖం పట్టడంతో వాటి స్థానాన్ని ఈ సంస్థలు భర్తీ చేస్తున్నాయి.

ఇక్కడ ఒక పరిణామాన్ని గమనించాలి. మొదట విదేశీ ప్రభుత్వాలే నేరుగా రుణాలిచ్చేవి. ఆ తర్వాత విదేశీ రుణం తగ్గి వ్యాపార బ్యాంకుల రుణాలు పెరిగాయి. ఇపుడు ఆ రుణాలు కూడా తగ్గి పైన ఉదహరించిన సంస్థల రుణాలు పెరుగుతున్నాయి. 1991-96 మధ్య ఒక్క అమెరికా ఇన్వస్టర్లే 330 బిలియన్ డాలర్లు ప్రపంచదేశాల స్టాక్‌మార్కెట్లలో, బాండ్స్‌లో పెట్టుబడులు పెట్టాయి. డబ్బు పరిభ్రమణం ఎంత వేగంగా వుందంటే అన్ని వర్ధమాన దేశాలకూ నికరంగా ప్రవహించిన ప్రైవేటు పెట్టుబడులు 1990లో 44.4 బిలియన్ డాలర్లనుంచి 1996 నాటికి ప్రాథమిక అంచనా ప్రకారం 243.8 బిలియన్ డాలర్లకు పెరిగింది. ఇందులో ఒక్క చైనాకే 52 బిలియన్ డాలర్లు వెళ్ళింది. ఇంత డబ్బు చలామణిలో వుంటే పెట్టిన పెట్టుబడులకన్నా లాభాలు ఎక్కువగా ఆ దేశాలనుంచి తరలిపోతుంటాయి. ఉదాహరణకు సబ్-సహారన్ ఆఫ్రికా దేశాల నుంచి 1984లో ప్రారంభమై ప్రతీ సంవత్సరం నికరంగా ఆ దేశాల్లోకి వచ్చిన విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకన్నా ఎక్కువగా లాభాలు ఆ దేశాల నుంచి తరలివెళ్ళాయి. ఈ దేశాల్లో సంపాదించిన లాభాలు 1990-1994 మధ్య 24 నుంచి 30 శాతం. పైన ఉదాహరించిన వివరాలన్నీ కేవలం ప్రైవేటురంగం నుంచి వర్ధమాన దేశాలకు ప్రవహించిన పెట్టుబడులు గురించి మాత్రమే. ప్రభుత్వాలు మధ్య జరిగే లావాదేవీల్లో చేతులు మారే డబ్బు ఈ లెక్కల్లో లేవు.

**రూపాయి విలువ పతనం**

పైన పోర్ట్‌ఫోలియో పెట్టుబడులు, పెన్షన్ ఫండ్స్, మ్యూచువల్ ఫండ్స్ దేశంలోకి ఎలా ప్రవాహంలా వచ్చి పడుతున్నాయో వివరాలివ్వడం జరిగింది. అవి అంతే నడెన్‌గా ఎలా ఉపసంహరించబడతాయో కూడా తెలుసుకొన్నాం. అవి దేశంలోకి వచ్చినపుడు వున్న రూపాయిమారకం విలువ కూడా తీసుకొనిపోయే రోజున మారకం విలువ ఎంత వుందో దాని ఆధారంగా తీసుకొనిపోతారు. ఇటీవల కాలంలో డాలర్‌తో పోలిస్తే మన రూపాయ విలువ బాగా పతనమైంది. 1996లో 36 రూపాయలు వున్న మారకం విలువ ఇపుడు 46 రూపాయలకు పడిపోయింది. పోర్ట్‌ఫోలియో పెట్టుబడి 1996లో ఒక డాలరు వస్తే అంటే 36 రూపాయలు వస్తే, ఈ రోజున తీసుకొని పోతే 46 రూపాయల లెక్కన తీసుకొని పోతాడు. విదేశీ పెట్టుబడిదారుల పంట పండుతుంది. విదేశీయులకు లాభాలు సంపాదించి పెట్టడానికి, వినిమయదారులకు భారాలు పెంచడానికి మన ప్రభుత్వం మంత్రసాని పని చేస్తుందన్న మాట.

పైన చేసిన సుదీర్ఘ విశ్లేషణ తెలియచేసేది ఏమంటే ప్రపంచీకరణ దారిద్రీకరణకే దారితీస్తుంది. దేశమే దారిద్రీకరణ అయితే, దేశంలో నివసించే దరిద్రులు మరింత దరద్రులవుతారు. ఈ మహాభాగ్యానికేనా మనల్ని ఎదురు చూడమంటున్నారు?



# ఆయుధ ధారణ, వినియోగం

-వి. హనుమంతరావు

వయసు మళ్లిన వారు కర్ర ఆసరా చేసుకొని నడుస్తుంటారు. వయస్సులో ఉన్నవారు కు ా ఉదయం వాకింగ్ చేసేటపుడు చేతిలో కర్ర వుంచుకొంటారు. ఇలా కర్ర చేతిలో వుండడం వల్ల దాడిచేసే కుక్కల నుంచి తమను తాము రక్షించుకోవడానికి, అటు కుక్కల్ని తరమడానికి వీలవుతుంది. ఆ విధంగా కర్ర రక్షించే ఆయుధం, దాడి చేయడానికి వుపయోగించే ఆయుధం కూడా. కుక్కలు ఎదురు పడపనుకోండి. అపుడు కర్ర వుపయోగించే అవసరమే వుండదు. ఆర్ఎస్ఎస్ కార్యకర్తలు లాఠీలు ఉపయోగించి డ్రిల్లు చేస్తుంటారు. అయితే అది రక్షణకోసం కాదు, తమ ప్రత్యర్థుల మీద ప్రయోగించడానికే. సిక్కు మతస్థులు కృపాణం ధరించటం వారి మత సాంప్రదాయంగా భావిస్తారు. పార్టీల నాయకులు సభల్లో ఉపన్యాసాలివ్వడానికి వెళ్ళినపుడు అతని బాడీగార్డులే వారి రక్షణ ఆయుధాలు. ఆ గార్డులు లైసెన్సు వున్నా, లేకపోయినా, మొలలో పిస్టల్స్‌వుంటే ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు. రైతు రాత్రి పొలంలోకి వెళ్ళేటపుడు తీసుకొనివెళ్ళే కర్ర పాము, వృటా నుంచి రక్షించుకోవడానికే గాని ఎవరి తలకాయో బద్దలు కొట్టడానికి కాదు కదా. ఈ సందర్భాలన్నింటిలోనూ ఈ ఆయుధాలు వారివారి చేతుల్లో వున్నంత మాత్రాన వాళ్లు తప్పకుండా ఉపయోగిస్తారని కాదు; వారి లక్ష్యం మొదట రక్షణ, రెండవది శిక్షణ, కర్ర, కత్తి, తుపాకీ అన్నీ ఆయుధాలే. ఈ ఆయుధం చేతిలో వుందా లేదా అనే దాని కన్నా దాని ఉపయోగం ముఖ్యం. ఉపయోగించనంత కాలం ఆ ఆయుధం కేవలం అలంకారప్రాయం మాత్రమే.

రాజ్యాంగం ప్రకారం అందరికీ జీవించే హక్కు వుంది. అంటే జీవించే హక్కును రక్షించుకొనే హక్కు కూడా వుంటుంది. ఈ హక్కును వుపయోగించుకొనే హక్కు ప్రతీ పౌరుడికీ వుంది. అయితే ఈ హక్కును విచ్చలవిడిగా, విచక్షణారహితంగా ఉపయోగించకుండా ఆయుధాల చట్టం (ARMS ACT ) ఒకటి వుంది. ఓ కథ వుంది. బ్రిటన్‌లో ఒకపౌరుడు తన చేతి కర్రను గాలిలో తిప్పుకొంటూ నడుస్తుంటే దారిన పోతున్న ఒకాయన ముక్కుకు తగిలింది. ఆయన కోర్టుకు వెళ్ళాడు. కర్ర తిప్పుతున్న పెద్ద మనిషి నేను స్వతంత్రదేశం పౌరుణ్ణి, నేనేమైనా చేసే హక్కు నాకు వుంది అని వాదించగా న్యాయాధిపతి నీకు స్వతంత్రం వున్న మాట నిజమే. కాని అవతలి వాని ముక్కు ఎక్కడ ప్రారంభమవుతుందో, అక్కడ నీ స్వతంత్రం అంతమై పోతుందని తీర్పు ఇచ్చారట. న్యాయాధిపతి కర్రను తిప్పుతూ నడిచే హక్కును కాదనలేదు; అది ఇతరుల స్వతంత్రాన్ని హరించకూడదని, దానికి పరిమితులున్నాయని చెప్పటం జరిగింది. చెప్పొచ్చేదేమంటే, చేతిలో ఆయుధం వుండటం నేరం కాదు; దానిని ప్రయోగించడమే నేరం. కోర్టుల్లో కొన్ని కొన్ని సందర్భాల్లో స్వీయ రక్షణ కోసం తనను హింసించబోయిన లేదా బలాత్కరించబోయిన వారిని చంపిన కేసుల్లో, ముద్దాయిని శిక్షించకుండా వదలి వేసిన సందర్భాలు పత్రికల్లో చదువుతున్నాం. నువ్వు చంపావు కాబట్టి నిన్ను ఉరి తీస్తానని న్యాయాధిపతులు అనటం లేదు. ఇది గాంధీ పుట్టిన దేశం, అహింసకు ఆయన కంకణబద్ధుడే అయినా, కొన్ని సందర్భాల్లో హింసను సమర్థించకుండా వుండలేకపోయారు. శాంతిసాధన ఆయుధంతోనే ముడిపడి వుందనేది ప్రభుత్వ వాదన. ఆయుధాలతో గత నాలుగైదు నెలలపాటు తిరుగుతూనే వున్నా రాష్ట్రంలో శాంతి నెలకొంది. దీన్ని బట్టి తుపాకీ చేతులో వున్నంతమాత్రాన శాంతికి భంగం కలుగబోదని రుజువైంది. అంటే తుపాకీ ట్రిగ్గర్‌ను నొక్కాలా లేదా అనేది తుపాకీ చేతిలోని వున్నవారి మనసు మీద ఆధారపడి వుంది. కాబట్టి ఆయుధం అడ్డుకాబోదు. ఒక పక్క ప్రభుత్వం నక్సల్‌తో చర్చలు జరుపుతూంటే, పోలీసులు వాళ్లపని వాళ్లు చేసుకొని పోతున్నారంటే తుపాకీ హోంమంత్రి చేతుల్లోనే వున్నా, ట్రిగ్గర్ నొక్కటం పోలీసుల చేతుల్లో వున్నట్లు కనపడుతుంది.

ఇంకో విషయం. చర్చల్లో హోంశాఖ మాట్లాడే తీరువేరు, ముఖ్యమంత్రి మాట్లాడే తీరువేరుగా వుంది. ఇద పోలీసు వ్యవస్థకు గందరగోళ సంకేతాలు పంపిస్తుంది. హోంశాఖమాత్యునిలా సంయమనం పాటించాలా, లేక ముఖ్యమంత్రిలాగ తెగేదాక తాడు లాగే పద్ధతినవలంబించాలా? కాగా విస్పష్టమైన సంకేతాలను పంపాల్సింది ప్రభుత్వమే; నక్సలైట్లు వారి వైఖరిని మొదట్లోనే స్పష్టం చేశారు కాబట్టి వారినుంచి కొత్తగా ఆశించేదేమీ లేదు.

ఆయుధాలు వదలిపెట్టి జన జీవన స్రవంతిలో నక్సలైట్లు చేరాలని ముఖ్యమంత్రి విశాఖ, విజయనరగం జిల్లాల పర్యటన సందర్భంలో ప్రకటన చేసి నిర్నిబంధంగా చర్చిస్తాం అని ఎన్నికల ముందు చేసిన ప్రకటనకు పూర్తిగా భిన్నంగా వుంది. రాజ్యాంగం ఉల్లంఘున జరక్కుండా, చట్టబద్ధపాలన సాగించాల్సిన బాధ్యత ఆయనపై వుందనే విషయాన్ని ఎవరూ కాదనలేరు. సిపిఐ(మావోయిస్టు) పార్టీ ఆయుధాలు పట్టుకొని ప్రచారం చేయటం రాజ్యాంగాన్ని ఉల్లంఘించడమేనని, అది చట్ట విరుద్ధమని మేధావులు అభిప్రాయం వ్యక్తం చేస్తున్నారు. రాజ్యాంగం అమలు గురించి మనమంతా ఎంత తక్కువగా మాట్లాడితే, అంతగా మన మర్యాద దక్కుతుంది. వాజ్‌పాయ్ పాలనలో జస్టిస్ వెంకట చెల్లయ్య నాయకత్వాన ఏర్పాటు చేసిన రాజ్యాంగ పర్యవేక్షణ కమీషన్ నివేదికను చదివితే, రాజ్యాంగం పనితీరు, అమలు గురించి వీరెవ్వరూ మళ్లా ఎపుడూ మాట్లాడరు. వాళ్ల ముఖం తీసుకొని ఎక్కడో పెట్టుకోవాల్సి వస్తుంది. రాజ్యాంగం 38,39 41,42,45,46,47 సూత్రాలు ఏం చెబుతున్నాయో చూడండి.

నక్సలిజం

రాజ్యాంగం 38వ అధికారణ ప్రకారం ప్రభుత్వ సంస్థలు ప్రజలకు సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని సమకూర్చే సాధనాలుగా వుండాలి; వ్యక్తుల మధ్య ఆదాయ, అసమానతలను తగ్గించడానికి హోదాల్లోని అసమానతలను నిర్మూలించడానికి ప్రభుత్వం కృషి చేయాలి. అదేవిధంగా వేరు వేరు వృత్తుల్లో ఉన్నవారి మధ్య వేర్వేరు ప్రాంతాల్లో నివసిస్తున్న ప్రజలమధ్య ఆర్థిక పరిస్థితుల్లోనూ, పని, ఉద్యోగావకాశాలలోనూ వున్న అసమానతలను నివారించాలి. 39వ అధికారంలో పౌరులందరికీ, స్త్రీ పురుషులకు సమాన జీవనోపాధులు కల్పించాలి, దేశ వనరులూ, వాటి పంపిణీ మరియు యాజమాన్యం యావత్‌సంఘ ఔన్నతికి దోహదపడేలా వుండాలి, ఆర్థిక విధాన ఆచరణలో ఉత్పాదక వనరులు ఏ ఒక్కరిలోనో, లేక కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతం కాకుండా చూడాలని, ఒకే పని చేసే స్త్రీ, పురుషులకు ఒకే జీతం వుండాలని ఆదేశించింది. 39-ఎ అధికరణ న్యాయ వ్యవస్థ ప్రజలందరికీ అందుబాటులో వుండాలి, ఆర్థికంగా కోర్టులను ఆశ్రయించే శక్తి సామర్థ్యాలు లేనివారికి తగు న్యాయ సహాయం అందచేసే నిమిత్తం చట్టాల ద్వారా, ఇతరత్రా సంస్థలను ఏర్పరచాలని చెబుతూంది. 41వ అధికరణ పనిని కలిగివుండే హక్కు, చదువుకొనే హక్కు, నిస్సహాయులకు ఆర్థిక సహాయం కల్పించాలని, విద్యా సంస్థలు కాపిటేషన్ రుసుమును వసూలు చేయడం రాజ్యాంగానికి విరుద్ధమని, ఎస్సీలు, ఎస్టీలు, వెనుకబడిన తరగతుల వారిని సాంఘిక అన్యాయాలు, దోపిడీల నుంచి రక్షించాలని చెబుతూంది. 47 అధికరణ ప్రకారం పౌష్టిక ఆహారాన్ని అందచేయడానికి, జీవన ఆర్థిక ఆరోగ్య ప్రమాణాలను మెరుగుపరచాలని, మత్తు, మద్యం ఉపయోగాన్ని (ఔషధంగా మినహా) నిషేధించాలి. పూర్తిగా నిషేధించడానికి కృషి చేయాలి.

57 సంవత్సరాల తర్వాత కూడా రాజ్యాంగంలోని ఈ అధికరణల ప్రకారం చర్యలు తీసుకొన్న సూచనలైనా వున్నాయా? పైగా ఇందుకు వ్యతిరేకంగా చర్యలు చేపట్టి రాజ్యాంగాన్ని ప్రభుత్వమే ఉల్లంఘిస్తే నక్సలైట్లు రాజ్యాంగాన్ని ఉల్లంఘించాలని వేలెత్తి చూపటం ఎంతవరకు సమంజసం? అవి సాధించలేకపోవటం రాజ్యాంగ వ్యతిరేక పాలన కాదా? రాజ్యాంగం ఆదేశించిన మేరకు పాలించని ప్రభుత్వాన్నేమి చెయ్యాలి? సంపద, ఉత్పత్తి సాధనాలు కొద్దిమంది చేతుల్లో కేంద్రీకరించరాదని రాజ్యాంగం చెబుతుంటే, సంపద కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతం కావటమే కాక దేశంలో మరింతమంది బిలియనీర్లను సృష్టించటం రాజ్యాంగ వ్యతిరేక చర్య కాదా? చిన్న, సన్నకారు రైతుల కమతాల సంఖ్య పెరిగినా, ఆ కమతాల కింద భూమి మాత్రం అంత పెరగలేదని, కొద్దిమంది చేతుల్లో భూమి కేంద్రీకరణ అనేక పేర్లతో కొనసాగుతూంటే, దానికి ప్రభుత్వం వత్తాసు పలకటం రాజ్యాంగం ఆదేశాలకు అనుకూలమా, ప్రతికూలమా? మాజీ ఫ్యూడల్ భూస్వాములు నేడు కాంట్రాక్టర్లుగా, రాజకీయ నాయకులుగా రూపాంతరం చెంది తమ సంపదను రక్షించుకోవటం, పెంచుకోవటం రాజ్యాంగ అనుకూల పరిణామమా? వ్యవసాయ కార్మికుల్లో స్త్రీలకు, పురుషులకు కూలీ ఇవ్వటంలో వివక్ష చూపుతుంటే గుడ్లప్పగించి చూస్తుండమని రాజ్యాంగం చెప్పిందా? సోషలిస్టు సమాజస్థాపన లక్ష్యమని రాజ్యాంగం చెప్పితే, పెట్టుబడిదారీ విధానాన్ని దేశంలో ప్రతిష్టించటం రాజ్యాంగంలో 'అ' మొదలు 'క్ష' వరకూ వ్యతిరేకించటమే అవుతుంది. అన్ని రంగాల్లో అసమానతలు దిన దిన ప్రవర్ధమానం చెందేలా పాలన కొనసాగించమని రాజ్యాంగం ఆదేశించలేదే? భూసంస్కరణలను ఇలా నీరు కార్చమని రాజ్యాంగం చెప్పలేదే? సంవత్సరాలు, దశాబ్దాలపాటు పేదలు ఎంత మొర పెట్టుకొన్నా, ఎంతమంది నాయకులను, అధికారులను కలుసుకొని వ్రాత పూర్వకంగా ప్రాధేయపడినా, స్పందించవద్దని రాజ్యాంగం చెప్పలేదు. కడుపు చించుకొంటే కాళ్ళమీద పడుతుంది.

మళ్ళా ఆయుధాల విషయానికొస్తే, రెండు భిన్న ధృవాల్లో నిల్చొని చర్చలు సాగిస్తే ఫలితం వుండదని, చర్చల్లో ఎపుడూ ఇచ్చి పుచ్చుకొనే ధోరణిని అవలంబించినపుడే, సమస్య మీద ఒప్పందం సాధ్యమవుతుందని అందరూ సూచిస్తున్నారు; అపుడే రాష్ట్రంలో శాంతి సాధ్యపడుతుంది. ఒప్పందం ముసాయిదాలో ఏడవక్లాజు విషయంలో వివాదం ఏర్పడింది. ఒకటవ క్లాజే ఏడవక్లాజులోని విషయాలను కవర్ చేస్తుంది. ఆ రెండు క్లాజులను ఈ క్రింద ఇస్తున్నా.

1. "ఇరుపక్షాలు ఒకరిపై ఒకరు తుపాకులు ఉపయోగించరాదు. ప్రాణనష్టం కలిగించే మరే ఇతర పద్ధతులకు పాల్పడరాదు. అన్ని రకాల సాయుధ చర్యలను నిలిపివేయాలి"

7. "చర్చల సమయములో శాంతియుత వాతావరణము కొనసాగేవిధంగా ఆయుధాలు లేకుండా పీపుల్‌వార్‌పార్టీగాని ఏ ఇతర రాజకీయ పార్టీగాని స్వేచ్ఛగా రాజకీయ ప్రచారము చేసుకోవచ్చును"

మధ్యే మార్గంగా, ఒకటి, ఏడవ క్లాజులను ఈ కింది విధంగా ఒకటి చేస్తే, ఆయుధాల సమస్య అడ్డం తొలగి, చర్చలు సజావుగా సాగడానికి, ముఖ్యంగా రాష్ట్రంలో శాంతి కొనసాగడానికి మార్గం సుగమమవుతుంది.

"చర్చల సమయంలో శాంతియుత వాతావరణం కొనసాగేవిధంగా సిపిఐ (మావో) పార్టీ, జనశక్తి పార్టీలు స్వేచ్ఛగా రాజకీయ ప్రచారం చేసుకోవచ్చు. ప్రభుత్వంతో చర్చలకు వచ్చే సందర్భంలో ఆ పార్టీల ప్రతినిధులు తుపాకులు ధరించరాదు. ఇరుపక్షాల్లు ఒకరిపై ఒకరు తుపాకులు ఉపయోగించరాదు. ప్రాణనష్టం కలిగించే ఇతర పద్ధతులకు పాల్పడరాదు. అన్ని రకాల సాయుధ చర్యలను నిలిపివేయాలి."

ముప్పది సంవత్సరాలుగా పరిష్కరింపబడని సమస్య మూడు రోజుల చర్చల్లో పరిష్కారం అవుతుందని ఎవరూ ఆశించరు. కలుసుకొని చర్చించడమే శుభారంభం. కోడిగుడ్డుకు వెంట్రుకలు లెక్కపెట్టే ప్రయత్నం చేయకుండా ప్రస్తుతం ఏర్పడిన శాంతి కొనసాగడానికి బయట నుంచి మనం చేయగలిగినది చేద్దాం.

❖

# 'చావులంబన' నుండి స్వావలంబనకు

-భూపతిరాజు సాంబశివరాజు

ఉన్న కంటిగుడ్లను పీకేసి
సొంత చూపును చిదిమేసి
ఎరువు చూపును అరువు తెచ్చి
హైటెక్‌గా మన కళ్ళకు అమరుస్తామంటారు
మనకు సొంత కళ్ళుండకూడదు
మెదడుండ కూడదు
గుండె ఉండకూడదు
మనస్సుండ కూడదు
మనువులు-మెకన్నీలు
ముద్దాడుకుని, ముచ్చటించుకుని
మనదికాని లేజర్ విజన్‌ను ప్రసాదిస్తున్నారు
మన-నడిచే కాళ్ళను
పనిచేసే చేతులను
ఆలోచించే మెదళ్ళను
స్పందించే మనస్సును
పంచేంద్రియాలను
నాడీ మండలాన్ని
వాళ్ళు, కబ్జాచేసి
మనల్ని, మరమనుషులను చేసి ఆడిస్తున్నారు
మన-మట్టిని, విత్తుని, నీటిని
మన-సమస్త వనరులను
కొల్ల గొట్టుకుని
మూటకట్టుకుని
వాళ్ళ-ఖాతాలో జమచేసుకుని
మనల్ని-వాళ్ళ పాద దాసులను చేస్తున్నారు
మన-వ్యవస్థ మొత్తం వాళ్ళకోసం మాత్రమే
పనిచేసే వలసగా మలిచేస్తున్నారు
మనల్ని-పూర్తిగా దోలిచేస్తున్నారు
ఆకలి చావులకు, ఆత్మహత్యలకు నెట్టేస్తున్నారు

ఎల్.పి.జి లిబరలైజేషన్, ప్రయివైటేజేషన్,
గ్లోబలైజేషన్‌అనే వింత శిశువును
మనచేతుల్లో పెట్టారు
ఇది భగవత్ ప్రసాదమని
అల్లారుముద్దుగా దీనిని
సాకి, పెంచి తరించమని
అద్వానీలు-అంబానీలు
జార్జ్‌బుష్‌లు-నాయుడుబాబులు
మన్‌మోహన్లు-చిదంబరాలు
బుద్ధదేవులు-టోనిబ్లెయిర్లు
మన-బుజాలకెక్కి సవారిచేస్తున్నారు
మరి మనమేం చెయ్యాలి?
చావులంబన కాదు, స్వావలంబనే దారని
నినదించి కదలాలి
తుపాకుల తెరచాటున
బూటకపు శాంతి శాలువలు కప్పుకున్న
పులిచారల ప్రభుత్వాలను
నిజమయిన శాంతికోసం నిలదీసి చెప్పాలి
దున్నేవారికే భూమంతా
పండించే వారికే పంటంతా
కార్మికులకు, గనులు, పనులు చెందాలని
ప్రణాళికలు, ప్రాజెక్టులు, ఆనకట్టలు, బ్యాంకులు
కాంట్రాక్టర్లకు, దళారీలకు, ఆఫీసర్లకు కాదని
చమటోడ్చే, కష్టించే, సృష్టించే జనావళికేనని
అప్పులు, తాకట్టులు, హైటెక్‌ల ట్రిక్కులు తుంగలో తొక్కాలని
ఆలోచించే మెదళ్ళకు, పనిచేసే చేతులకు
పూర్తిగా పనికల్పించే విధానాలే కావాలని
చావులంబన కాదు-స్వావలంబనే మాదారని
ఎలుగెత్తి చాటాలి

స్వావలంబన అంటే ఓ అరిగిపోయిన ఆయుధమని, తుప్పట్టిపోయిన నినాదమని ఈనాటి ప్రపంచీకరణ సందర్భంలో తరుచుగా వినవస్తున్న మాట. శరవేగంగా అభివృద్ధి చెందుతున్న ఆధునిక శాస్త్ర సాంకేతిక విజ్ఞానయుగంలో, దేశాల మధ్య ఎల్లలు చెరిగిపోతున్నాయనే భ్రమల్లో జోగుతున్న భారతదేశ మధ్యతరగతి సమాజం, ముఖ్యంగా ఇంట, బయటా ఉద్యోగ అవకాశాలను అందిపుచ్చుకున్న వర్గం స్వావలంబన అంటేనే విరుచుకు పడుతుంది.

అయితే ఇది రాసే నాతో సహా ఎంతోమంది ఒక విషవలయంలో చిక్కుకుని కొట్టుమిట్టాడుతున్నాం. ఆ విషవలయమే ప్రపంచీకరణ. ఇది ఓ రంగుల వల. దీని అంతస్సూత్రం వ్యక్తిగత అభివృద్ధి, దీని మూలాలు వ్యక్తిగత ఆస్థిలో ఉంటాయి. దోపిడి పునాదిపై ఈ ఆలోచనా విధానం నిర్మించబడి ఉంటుంది. సామాజిక న్యాయ భావనను, సామాజిక సమ్యక్ దృక్పధాన్ని ఇది పూర్తిగా దెబ్బతీస్తుంది. ఇంకా చెప్పాలంటే మన ఆధ్యాత్మిక, తాత్విక, ధార్మిక చింతనను కూడా ఇది పెకలించి వేసి దాని స్థానంలో ఓ వికృత, వింత వస్తు వినిమయ సంస్కృతిని, అలజడిమయ వాతావరణాన్ని సమస్త సమాజ పునాది మండలంలో చొప్పించి తమ పబ్బం గడుపుకునే ఓ పరాన్న భుక్కు సామ్రాజ్యవాద రంగులవలే ఇదని ప్రజలు అర్ధం చేసుకునే లోపుగానే అనర్ధం జరిగిపోతుంది.

ఉదాహరణకి పెట్రోలియం ఉత్పత్తుల దిగుమతినే తీసుకుంటే, ఆ దిగుమతుల కోసం పెట్టే ఖర్చు రూపేణా మన సమాజం కోల్పోతున్న సంపదను లెక్కకడితే, ప్రతి ఒక్కరూ దాని గురించి సీరియస్‌గా ఆలోచిస్తే మనం తిరిగి బహుశా ఇటువంటి ఇంధనాలతో నడిపించే ప్రయాణసాధనాలు, యంత్రసాధనాలు, రవాణా వ్యవస్థ గురించి వాటి మూలంగా పర్యావరణానికి జరిగే హాని గురించి, ప్రజలకు, ఇతర జీవరాసులకు జరిగే హాని గురించి మన ఆలోచనను పూర్తిగా తిరగదోడుకోవలసి వస్తుంది. పర్యావరణానికి హానికలగని ప్రత్యామ్నాయ ఇంధనాలవైపు, సాధనాలవైపు మన ఆరోగ్యాన్ని మెరుగుపరిచే స్వతంత్రమయిన జాతీయమయిన వ్యవస్థను రూపొందించుకోవలసి ఉంటుంది. ఇటువంటి వ్యవస్థ మూలం-ఆధారం "స్వావలంభన"

అలాగే మన వ్యవసాయంలో ప్రపంచీకరణ చొరబడి శ్రమచేసే రైతు-అతనికి శ్రమలో చేదోడుగా ఉండే పశువు-ప్రకృతి సమతుల్యాన్ని కాపాడే వ్యవసాయక పద్ధతులు వీటికిమధ్య ఉండే ఒక సజీవ సంబంధాన్ని ధ్వంసం చేసి మనమట్టి మీదే మనం చావు కొని తెచ్చుకొనే దయనీయమయిన స్థితి, ఆర్థిక, భావదాస్యం మనకళ్ళ ముందు కరాళనృత్యం చేస్తోంది. దీనికి విరుగుడు స్వావలబన కాక వేరే ఏముంటుంది? అట్లాకాక, అంటే ప్రపంచీకరణ రంగుల వలను ఛేదించుకుని బయట పడక మరింతగా అందులో పెనవేసుకు పోయినట్లయితే కొద్దిమంది దళారీలకి కాసులపంట. మెజారిటీ ప్రజలకు ఆత్మహత్యల బాట మిగులుతుంది.

మనవిత్తు, మననేల, మననీరు, మన వ్యవసాయం, మన పశుసంపద, మన శ్రామిక ఆలోచనా విధానాన్ని నిలబెట్టుకుంటూ, మెరుగు పరచుకుంటూ, ఉన్నతీకరించుకుంటూ, నాణ్యతీకరించుకుంటూ ప్రకృతి-పశువు-మనిషి-మొక్క-పక్షి వీటి మధ్య ఉన్న సమతుల్యాన్ని కాపాడుకుంటూ మన సొంత ప్రణాళికలు రచించుకునే దిశగా మనం తిరిగి విముక్తులం కావడమే స్వావలంభన.

ఇరిగేషన్ ప్రాజెక్టులుగాని, విద్యుత్ ప్రాజెక్టులు గాని, తదితర మౌలిక సదుపాయాల వ్యవహారం కానివ్వండి-ఇంత పెద్ద స్వతంత్ర భారత దేశంలో, ఎంతోమంది మేధావులు, ఇంజనీర్లు, టెక్నీషియన్లు, శ్రమచేయడానికి సిద్ధంగా ఉన్న ప్రజలు, సహజవనరులు ఉన్న దేశంలో ప్రపంచబ్యాంకు నుండి అప్పులు తేకుండా అభివృద్ధి ఎలా జరుగుతుంది? అని ప్రశ్నించే రాజకీయ నాయకుల పరిపాలనలో ఈదేశం, సమాజం ఇరుక్కుపోవడం ఓ విషాదం. ఇటువంటి నాయకులు, ఇలా అంటున్నారంటే దీని వెనుక ఇమిడి ఉన్న దళారీ, కాంట్రాక్టర్, పొలిటీయన్, ఫ్యూడల్, సామ్రాజ్యవాద శక్తుల సమైక్య COMMON VOICE అని గుర్తించాలి. గుర్తించడమే కాదు, దానిని పూర్తిగా బట్టబయలు చెయ్యాలి. అందులో ఇమిడి ఉన్న ప్రజా వ్యతిరేక కొల్లగొట్టుడు వ్యవహారాన్ని ఓడించడానికి ప్రజలను సన్నద్ధం చెయ్యాలి.

'స్వావలంబన' అనే నినాదం ఇస్తే చాలదు. స్వావలంబనకు-శ్రామిక ప్రజలకు, విస్తృత ప్రజానీకానికి ఉన్న అంతస్సంబంధాన్ని, పాలక వర్గాలు అంతర్జాతీయ దోపిడి శక్తులతో కలగలసిపోయి తన్నుకుపోతున్న ప్రజల స్వార్జితాన్ని ఎలా కాపాడుకోవాలో విడమర్చి చెప్పడం ద్వారా, ఆ దిశగా ఆచరణాత్మక వ్యూహరచన చెయ్యడం ద్వారా బూటకపు అభివృద్ధి స్థానంలో స్వావలంబనను నిలబెట్టగల్గుతాం.

ఇప్పటి పరిస్థితిలో స్వావలంబన అంటేనే మరో స్వాతంత్ర పోరాటం; సామ్రాజ్యవాద వస్తు వినిమయ సంస్కృతీ తిరస్కరణోద్యమం. దీనిని విస్తృత ప్రజానీకంచేత గుర్తింపచేసి ఈ ఉద్యమబాట పట్టించడమే భారతదేశ మేధావులు చెయ్యవలసిన పని. అందుచేత వీరంతా తేల్చుకోవాల్సింది వారెటు వైపో? (ప్రజల వైపా? సామ్రాజ్యవాదం వైపా?)



# కనుమరుగవుతున్న అటవీ సంపద

-అపర్ణ

పర్యావరణ సమతుల్యాన్ని పరిరక్షించటంలో అడవులు ప్రధాన భూమిక పోషిస్తాయి. కలప, వెదురు, వంట చెరకుతో పాటు జిగురు, బీడి ఆకు లాంటి ఇతర ఉత్పత్తులను మనకు అందించటమే కాక ప్రాణవాయువు రిసైక్లింగ్, కాలుష్య నియంత్రణ, తుఫానులు, వరదల నుంచి భూమి కోతపడకుండా రక్షణ కల్పించటంలో అడవులు మనకు అమూల్యమైన సేవలందిస్తున్నాయి. వన్యప్రాణులకు జీవనాధారంగా ఆశ్రయమిస్తున్నాయి. భూమిపై పెరుగుతున్న వత్తిడి, స్వార్థపరశక్తుల అక్రమ కార్యకలాపాలు అడవుల నరికివేతకు కారణాలవుతున్నాయి. పర్యాటకులను ఆహ్లాదపరచే అటవీ ప్రకృతి సంపదను కాపాడుకోవలసిన బాధ్యత ప్రభుత్వానికే కాకుండా ప్రజా బాహుళ్యం మీదగూడ వుంది. రాష్ట్రంలో భూమి వినియోగ గణాంకాలను అర్థగణాంకశాఖ ప్రతిఏటా విడుదల చేస్తుంది. ఈ అడవుల ద్వారా రాష్ట్రానికి స్థూల ఆదాయం ఏ మేర లభిస్తుందనే గణాంకాలను గూడా ఈ శాఖ సంకలనం చేస్తుంది. ఈ గణాంకాలను బట్టి రాష్ట్రానికి అటవీ సంపద ఏమాత్రం లభించింది విశ్లేషించవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది.

**అటవీ భూమి:**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఆవిర్భవించిన 1956-57 సం.లో రాష్ట్రంలో వున్న అడవులకింద వున్న భూమి 55.68 లక్షల హెక్టార్లు, 1968-70 నాటికి 65.09 లక్షల హెక్టార్లుకు పెరిగినా తరువాత తెలుగుదేశం పార్టీ ప్రభుత్వ హయాంలో 1983-84 నుండి 1988-89 వరకు అడవుల క్రింద వున్న భూమి సగటున 50.54 లక్షల హెక్టార్లుకు తగ్గిపోయింది. తరువాత కాంగ్రెస్‌పార్టీ రాష్ట్ర ప్రభుత్వ పగ్గాలు చేపట్టిన 1989-90 నుండి 1994-95 సంవత్సరంలో సగటున అడవుల క్రింద వున్న భూమి 62-60 లక్షల హెక్టార్లకు పెరిగింది. నారా చంద్రబాబు నాయుడు రాష్ట్ర అధికార పగ్గాలు చేపపట్టినాక 1995-96 నుండి 2002-03 వరకు రాష్ట్రంలో అడవుల విస్తీర్ణం సగటున 61.85లక్షల హెక్టార్లకు పడిపోయింది. అర్థగణాంక శాఖ ఇటీవల విడుదల చేసిన "గణాంక సంగ్రహం 2004"ను బట్టి దేశంలో అడవుల క్రింద భూమి మధ్యప్రదేశ్‌లో 147.12 లక్షల హెక్టార్లు వుండగా ఆంధ్రప్రదేశ్ రెండవ స్థానంలో వుంది. భూమి విస్తీర్ణంలో అడవుల క్రింద మూడింట ఒక వంతు భూమి వుండాలని జాతీయ అటవి విధానం సూచిస్తూ వుండగా మన రాష్ట్రంలో మొత్తం భూవిస్తీర్ణంలో 2002-03 సం.లో 22.59 శాతమే వుంది. (అది కూడా చెట్టూ చేమాలేని భూములను, పల్చ పల్చగానే మొక్కలు మొలిచిన భూములను కూడా అడవుల జాబితాలో చేరిస్తే) దీన్ని బట్టి అడవులు ఇంకను పెంచవలసిన బాధ్యతను ప్రభుత్వం సత్వరం చేపట్టాలి. అడవుల నరికివేతకు గురి కాకుండా ప్రభుత్వం తగు చర్యలు తీసుకోవాలి. ఇక జిల్లాల వారీగా చూస్తే 2002-03 సం.లో ఖర్చు జిల్లాలో 7.44 లక్షల హెక్టార్లు అటవీ భూమి వుండగా ఆదిలాబాద్ జిల్లా 6.90 లక్షల హెక్టార్ల అటవీ భూమితో రెండవస్థానంలో, కడప 5.05 లక్షల హెక్టార్లతో మూడవ స్థానంలో, విశాఖపట్నం 4.78 లక్షల హెక్టార్లతో నాలుగవ స్థానంలో వుంది.

**అటవీ రంగం ద్వారా ఆదాయం:**

అటవీరంగం ద్వారా లభించిన స్థూల రాష్ట్ర ఆదాయం ప్రస్తుత ధరల్లో 1960-61 సం.లో రు. 20.75 కోట్లు. ఇది మొత్తం స్థూల రాష్ట్ర ఆదాయంలో 1.57 శాతం వుండగా 2003-04 సం. ముందస్తు అంచనాల ప్రకారం 1 శాతానికి పడిపోయింది. నిలకడ ధరల్లో చూసినా 1960-61 సం.లో అటవీరంగం నుంచి లభించిన స్థూల ఆదాయం మొత్తం స్థూల రాష్ట్ర ఆదాయంలో 4.97 శాతం వుండగా 2003-04 సం. ముందస్తు అంచనాల ప్రకారం 0.74 శాతానికి పడిపోయింది. 1993-94 నుండి 2003-04 సంవత్సరం వరకు రాష్ట్రంలో అడవుల ద్వారా లభించిన స్థూల రాష్ట్ర ఆదాయంలో నిలకడ ధరల ప్రకారం 1.17 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నయోదయింది. 1995-96 నుండి 2002-03 సం. వరకు అటవీ రంగం నుండి లభించిన స్థూల రాష్ట్ర ఆదాయంలో నిలకడ ధరల ప్రకారం మన రాష్ట్రంలో 1.34 శాతం కాంపౌండ్ అభివృద్ధిరేటు నమోదు కాగా ఉత్తరప్రదేశ్ 30.78 శాతం అభివృద్ధి రేటుతో మొదటి స్థానంలో వుండగా, పంజాబు 5.37 శాతం అభివృద్ధి రేటుతో రెండవ స్థానంలో, బీహారు మూడవస్థానంలో, రాజస్థాన్ నాలుగవస్థానంలో, ఒరిస్సా 5వ స్థానంలో వుండగా, ఆంధ్రప్రదేశ్ 10వ స్థానంలో వుంది. దేశం మొత్తం మీద అటవీరంగం నుండి లభించిన స్థూల జాతీయ ఆదాయం ఇదే కాలంలో 2.23 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నయోదయింది.

జిల్లాల వారీగా స్థూల రాష్ట్ర ఆదాయ గణాంకాలు వివిధ రంగాల వారీగా 2001-02 వరకే లభిస్తున్నాయి. 1995-96 నుండి 2001-02 వరకు అటవీరంగం నుండి రాష్ట్రానికి లభించిన స్థూల ఆదాయంలో 1.75 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నమోదు కాగా ఇదే నిలకడ ధరల్లో జిల్లాల వారీగా చూస్తే శ్రీకాకుళం, నల్లగొండ జిల్లాలు 2.02 శాతం అభివృద్ధి రేటుతో ప్రథమస్థానంలో వుండగా, మెదక్ రెండవ స్థానంలో, మహబూబ్‌నగర్ మూడవస్థానంలో, విజయనగరం నాలుగవస్థానంలో, పశ్చిమగోదావరి ఐదవస్థానంలో వున్నాయి.

**అటవీ ఉత్పత్తులు:**

మన రాష్ట్రంలో అడవుల నుండి లభించే వెదురు, గుజ్జు, కలప, యూకలిప్టస్‌లపై ఆధారపడి అనేక పరిశ్రమలు పనిచేస్తున్నాయి. చింతపండు, తేనె, ఉసిరికాయలు, బంక, కరక్కాయలు, షీకాయపొడి, ఫలాలు మొదలగు అనేక రకాల మైనర్ అటవీ ఉత్పత్తులు ప్రధానంగా ఏజెన్సీ ప్రాంతాల్లో పుష్కలంగా లభ్యమవుతున్నాయి. ఏజెన్సీ ప్రాంతాల్లో గిరిజన ప్రజలకు ప్రధాన జీవనాధారం వీటి అమ్మకాలేనని చెప్పవచ్చును.

## అడవులు

రాష్ట్రంలో వున్న అటవీ సంపదను పరిరక్షించుకోవటానికి అడవులను, రైతుల ప్రయోజనాలు, సామాజిక ప్రయోజనాలు పరిరక్షించుకొనేందుకు వీలుగా రూపుదిద్దు కోవలసిన ఆవశ్యకత వుంది. అడవుల క్రింద నమోదయి బంజర్లుగా వుండే భూములను చెట్టు పట్టాల పేరుతో పేద ప్రజలకు పంపిణీ చేస్తే అటవీ భూములను పంచి పెట్టటం ద్వారా నక్సలైట్స్ బెడద కొంతవరకు తప్పుతుంది. వృక్ష సంపద లేకుండా మానవుని మనుగడ సవ్యంగా సాగించడం అసాధ్యమని శాస్త్రజ్ఞులు తమ పరిశోధనల ద్వారా తెలుపుతున్నారు. ఈ పరిస్థితుల్లో సామాజిక అడవులను పెంచటం, వీలయినంత ఎక్కువగా చెట్లు నాటి పెంచటంద్వారా పరిసరాల సమతుల్యాన్ని కాపాడడమే కాకుండా వాతావరణ కాలుష్యాన్ని గూడ అరికట్టవచ్చు. అటవీ శాఖ నిర్వహణలో INDIAN FOREST SERVICE అధికారుల సర్వీసులనే వినియోగించుకోవాలి. వీరిని ఇతర శాఖలకు బదిలీ చేయకుండా సత్వర చర్యలు తీసుకోవాలి. ముఖ్యంగా అటవీ ప్రాంతాల్లో స్మగ్లింగ్ జరగకుండా, అవినీతిని అరికట్టేందుకు సత్వర చర్యలు చేపట్టాలి.

వరదలు, ప్రకృతి భీభత్సాలు ఏర్పడినపుడు తీరప్రాంతంలోని భూముల సారవంతమైన పొరలు కొట్టుకొని పోకుండా ఉండేందుకు సామాజిక అడవులను పెంచాలి. రిజర్వాయర్ల ఎగువప్రాంతాల్లో కూడ చెట్లను పెంచటం అవసరం. దీని వలన రిజర్వాయర్లు మేట పడకుండా కొంత నిరోధించటం వీలవుతుంది. రైతుల జీవన ప్రమాణాలు మెరుగుపడేందుకు వారిని సామాజిక అడవుల పెంపకంలో పాలుపంచుకొనేటట్లు చేయాలి. ముఖ్యంగా మన రాష్ట్ర ముఖ్యమంత్రి డా.వై.ఎస్.ఆర్. నిర్వహించే 'రాజీవ్ పల్లెబాట' కార్యక్రమంలో చైతన్యవంతులుగా చేయాలి. అప్పుడే రాష్ట్రం "నవ్యాంధ్ర ప్రదేశ్"గా రూపు దిద్దుకొనే అవకాశముంది. "వన రక్షణే మన రక్షణ" అని నినాదం పల్లెబాట కార్యక్రమంలో ప్రతిధ్వనించాలి.

### ఆంధ్రప్రదేశ్‌లో అడవుల క్రింద భూవిస్తీర్ణం

(లక్షల హెక్టార్లలో)

| సంవత్సరం (1) | అడవులక్రింద వున్న భూమి (2) | మొత్తంభూమి వినియోగం (3) | కాలం(3)లో కాలం(2)శాతం (4) |
|---|---|---|---|
| 1956-57 | 55.68 | 268.92 | 20.7 |
| 1960-61 | 58.47 | 272.97 | 21.4 |
| 1970-71 | 63.37 | 274.40 | 23.1 |
| 1980-81 | 62.12 | 274.40 | 22.6 |
| 1990-91 | 62.68 | 274.40 | 22.8 |
| 1995-96 | 61.48 | 274.40 | 22.4 |
| 1996-97 | 61.38 | 274.40 | 22.4 |
| 1997-98 | 61.99 | 274.40 | 22.6 |
| 1998-99 | 61.99 | 274.40 | 22.6 |
| 1999-00 | 61.99 | 274.40 | 22.6 |
| 2000-01 | 61.99 | 274.40 | 22.6 |
| 2001-02 | 61.99 | 274.40 | 22.6 |
| 2002-03 | 61.99 | 274.40 | 22.6 |

ఆధారం: ఆర్థిక గణాంకశాఖ, హైదరాబాద్

### అటవీరంగం నుంచి లభించిన స్థూల రాష్ట్ర ఆదాయం- నిలకడ ధరల్లో 1995-96 నుండి 2003-04

(రు.కోట్లు)

| సంవత్సరం (1) | అటవీరంగంనుండి స్థూల రాష్ట్రాదాయం (2) | మొత్తంస్థూల రాష్ట్రాదాయం (3) | కాలం(2)లో కాలం(3)శాతం (4) |
|---|---|---|---|
| 1995-96 | 691 | 64729 | 1.07 |
| 1996-97 | 681 | 68809 | 0.99 |
| 1997-98 | 664 | 67866 | 0.98 |
| 1998-99 | 712 | 76116 | 0.94 |
| 1999-00 | 739 | 79605 | 0.93 |
| 2000-01 | 757 | 86513 | 0.88 |
| 2001-02 (తా.అం) | 731 | 90558 | 0.81 |
| 2002-03 (స.అం) | 725 | 92755 | 0.78 |
| 2003-04 (ముం.అం) | 738 | 99320 | 0.74 |

(తా: తాత్కాలిక అంచనా, స: సవరించిన అంచనా, ముం: ముందస్తు అంచనా)

ఆధారం: ఆర్థిక గణాంకశాఖ, హైదరాబాద్

### రాష్ట్రాలవారిగా అటవీరంగం నుండి లభించిన స్థూలరాష్ట్ర ఆదాయం-నిలకడ ధరల్లో 1995-96 నుండి 2002-03 వరకు

| రాష్ట్రం (1) | 1995-96 (2) | 1996-97 (3) | 1997-98 (4) | 1998-99 (5) | 1999-2000 (6) | 2000-01 (7) | 2001-02 (8) | 2002-03 (9) | కాంపౌండు అభివృద్ధి(%) 1995-96 నుండి 2002-03 వరకు (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 691 | 681 | 664 | 712 | 739 | 757 | 731 | 725 | 1.34 |
| అస్సాం | 303 | 306 | 309 | 313 | 321 | 332 | 336 | 340 | 1.82 |
| బీహారు | 448 | 446 | 456 | 501 | 532 | 553 | 574 | 595 | 4.73 |
| గుజరాత్ | 452 | 453 | 478 | 473 | 468 | 490 | 498 | 507 | 1.61 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| హర్యానా | 62 | 65 | 64 | 61 | 60 | 60 | 64 | 66 | 0.18 |
| కర్ణాటక | 981 | 1113 | 1034 | 1050 | 1018 | 1022 | 1089 | 1041 | 0.29 |
| కేరళ | 720 | 750 | 729 | 761 | 806 | 694 | 692 | 681 | (-)1.05 |
| మధ్యప్రదేశ్ | 1000 | 1044 | 1071 | 1055 | 950 | 1037 | 1154 | 1112 | 1.25 |
| మహారాష్ట్ర | 1383 | 1'06 | 1355 | 1230 | 1285 | 1527 | 1427 | 1494 | 1.22 |
| ఒరిస్సా | 609 | 614 | 699 | 629 | 725 | 741 | 743 | 765 | 3.47 |
| పంజాబు | 41 | 39 | 46 | 44 | 54 | 58 | 52 | 55 | 5.37 |
| రాజస్థాన్ | 626 | 637 | 666 | 677 | 698 | 758 | 778 | 802 | 4.07 |
| తమిళనాడు | 416 | 417 | 434 | 447 | 477 | 442 | 437 | 471 | 1.47 |
| ఉత్తరప్రదేశ్ | 262 | 408 | 593 | 1429 | 1476 | 1532 | 1588 | 1647 | 30.78 |
| పశ్చిమ బెంగాల్ | 489 | 471 | 477 | 489 | 522 | 513 | 543 | 542 | 2.07 |
| భారతదేశం | 11701 | 11865 | 12114 | 12301 | 12753 | 13064 | 13244 | 13573 | 2.23 |

ఆధారం: అర్థగణాంకశాఖ, హైదరాబాద్

## అటవీరంగం నుండి లభించిన స్థూల జిల్లా ఆదాయం-నిలకడధరల్లో 1995-96 నుండి 2001-02 వరకు

(రు.కోట్లు)

| జిల్లా | 1995-96 | 1996-97 | 1997-98 | 1998-99 | 1999-2000 | 2000-01 స.అం. | 2001-02 తా.అం. | కాంపౌండు అభివృద్ధి(%) 1995-96 నుండి 2001-02 వరకు |
|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 22.40 | 22.65 | 22.86 | 23.38 | 24.38 | 24.91 | 24.79 | 2.02 |
| విజయనగరం | 21.14 | 21.15 | 21.05 | 21.95 | 22.84 | 23.37 | 22.98 | 1.91 |
| విశాఖపట్నం | 34.72 | 33.68 | 32.12 | 35.46 | 36.64 | 37.62 | 35.61 | 1.54 |
| తూర్పుగోదావరి | 45.37 | 45.01 | 44.48 | 46.93 | 48.74 | 49.90 | 48.65 | 1.83 |
| పశ్చిమగోదావరి | 31.86 | 32.22 | 32.56 | 33.16 | 34.54 | 35.26 | 35.07 | 1.90 |
| కృష్ణా | 30.03 | 30.29 | 30.58 | 31.04 | 32.25 | 32.89 | 32.56 | 1.66 |
| గుంటూరు | 36.91 | 37.01 | 37.00 | 38.20 | 39.70 | 40.56 | 39.92 | 1.76 |
| ప్రకాశం | 34.32 | 33.40 | 31.96 | 35.34 | 36.63 | 37.66 | 35.90 | 1.85 |
| నెల్లూరు | 25.78 | 25.36 | 24.66 | 26.58 | 27.57 | 28.27 | 27.26 | 1.79 |
| చిత్తూరు | 38.34 | 37.46 | 36.04 | 39.49 | 40.94 | 42.05 | 40.24 | 1.81 |
| కడప | 30.41 | 29.16 | 27.28 | 31.11 | 32.16 | 33.12 | 31.02 | 1.72 |
| అనంతపురం | 31.19 | 31.08 | 30.80 | 32.28 | 33.55 | 34.33 | 33.58 | 1.82 |
| కర్నూలు | 32.58 | 31.92 | 30.86 | 33.54 | 34.76 | 35.67 | 34.21 | 1.76 |
| మహబూబ్‌నగర్ | 34.80 | 34.45 | 33.76 | 36.08 | 37.51 | 38.47 | 37.39 | 1.95 |
| రంగారెడ్డి | 19.77 | 19.76 | 19.75 | 20.27 | 20.99 | 21.41 | 20.96 | 1.43 |
| హైదరాబాద్ | 13.29 | 13.06 | 12.98 | 12.85 | 13.02 | 13.11 | 12.33 | (-)0.74 |
| మెదక్ | 22.20 | 22.35 | 22.44 | 23.13 | 24.09 | 24.63 | 24.39 | 1.97 |
| నిజామాబాద్ | 21.58 | 21.36 | 20.94 | 22.32 | 23.18 | 23.75 | 23.06 | 1.85 |
| అదిలాబాద్ | 34.07 | 32.08 | 29.14 | 34.68 | 35.76 | 36.96 | 33.88 | 1.70 |
| కరీంనగర్ | 31.76 | 31.48 | 30.92 | 32.85 | 34.15 | 34.99 | 34.02 | 1.86 |
| వరంగల్ | 32.74 | 32.06 | 30.92 | 33.76 | 35.02 | 35.95 | 34.48 | 1.83 |
| ఖమ్మం | 38.31 | 35.97 | 32.51 | 38.98 | 40.19 | 41.56 | 37.98 | 1.71 |
| నల్లగొండ | 27.61 | 27.92 | 28.19 | 28.83 | 30.07 | 30.71 | 30.57 | 2.02 |
| ఆంధ్రప్రదేశ్ | 691.18 | 680.88 | 663.80 | 712.21 | 738.68 | 757.16 | 730.85 | 1.75 |

ఆధారం: అర్థగణాంకశాఖ, హైదరాబాద్

# అవినీతిని అంతమొందించడానికి విద్య ఒక పరిష్కారం

(రెండవభాగం)

-ఎన్. విఠల్

ప్ర. అవినీతిపై పోరాడడానికి, ప్రజలు తమ ప్రాథమిక హక్కులు, విద్య, విలువలు మొదలైన వాటి గురించి తెలుసుకోవడం అవసరం. మీరేమంటారు?

జ. అవును ఇద్దరు ప్రొఫెసర్లు కోర్టుకు వెళ్ళి ఎన్నికల సంస్కరణలు అమలు జరిగేలా చేయగలిగారు. అది ప్రాథమిక హక్కులకు సంబంధించిన విషయం. ఈ సమస్యకి విరుగుడు విద్యే. ప్రజలకు తమ హక్కుల గురించిన విద్యే రాజకీయ నాయకులపై మంచి నిఘా అవుతుంది. నా మిత్రుడి భార్య పార్లమెంట్ సభ్యురాలు. ఆమె తనకు కేటాయించిన నియోజకవర్గ అభివృద్ధి నిధులతో ఒక బాలికల పాఠశాలను పెట్టాలనుకున్నారు. కాని అక్కడి రాజకీయ నాయకుడు ఒకరు స్కూలు పెట్టవద్దని, జనం చదువుకొని తెలివి మీరితే-మనకి ఇక ఓట్లు వేయరనీ-సలహా ఇచ్చాడు. మన రాజకీయ వాస్తవ పరిస్థితి ఇది. అందువల్ల అవినీతి ఎదుర్కోవడానికి విద్యే మంచి పరిష్కారం.

ప్ర. వివేకానందుడు యోచించనట్టుగా దేశాన్ని అభివృద్ధి చేయడానికి ఒక వందమంది యువకుల బృందం ఏర్పడాలి. కాని అది సాధ్యపడనే లేదు. మీలాంటి వారు పూనుకొని-వందమంది నిజాయితీపరులైన రిటైర్డ్ అధికారులతో అలాంటి ఉద్యమం నిర్మించడం సాధ్యపడుతుందా?

జ. సంఖ్య గురించి పట్టించుకోను. నాభావాలను వ్యాప్తి చేయడంకోసం కృషి చేస్తున్నాను. ఐదు సూత్రాలు మార్పు తేగలుగుతాయి. ఈ ఐదు సూత్రాలు ఐదుగురు ప్రముఖవ్యక్తులు చెప్పినవి. బెట్రాండ్ రస్సెల్ చెప్పినదేమిటంటే, ఏ అభిప్రాయాన్నయినా తగినంత కాలం ప్రచారంచేస్తే దానికి గౌరవం లభిస్తుంది. నేను టెలికాం ఛైర్మన్ అయినపుడు, 2000లో టెలిఫోన్ కనెక్షన్ ఇవ్వడం కోసం రెండేళ్ళ సమయం పడుతుందని అక్కడి సాంకేతిక నిపుణులు చెప్పేవారు. రెండు రోజుల్లో ఎందుకు ఇవ్వలేరని నేను అడిగేవాడిని. చివరికి టెలికాం విప్లవం ఎలా విజయవంత మయిందో చూస్తున్నారుగా! అందువల్ల-ఇది సాధ్యమే. కావలసిందల్లా ఏమిటంటే మనం చేపట్టిన అభిప్రాయాన్ని వదలుకోక పోవడమే. భారతదేశం అవినీతిరహితంగా ఏదో ఒకనాటికి గొప్ప దేశంగా మారుతుందన్న నా అభిప్రాయాన్ని నేను వదలుకోలేదు. అందువల్ల, మనం దానికోసం కృషి చెయ్యాలి. ఇది మొదటిసూత్రం.

రెండవది: విక్టర్ హ్యూగో చెప్పినది. సమయంవస్తే, ఒక భావానికంటే శక్తివంతమయినది మరేదీ లేదు. ఇలా జరగడం మనం చూస్తూనే ఉన్నాం.

మూడవసూత్రం: మరో ఫ్రెంచ్ తాత్వికుడు అలెక్సిస్ డి టాక్సివెల్లి తప్పనిసరి అయ్యేదల్లా దుర్భరమవుతుందని చెప్పారు. 1975లో ఇందిరాగాంధి ఎమర్జన్సీ ప్రకటించారు. ఇందిరే ఇండియా, ఇండియాయే ఇందిర అన్నదే చట్టంగా మారింది. ఆ తర్వాత 1977లో ఆమె ఎన్నికలు ప్రకటించారు. 'తప్పదు' అనుకున్న ఇందిర 'దుర్భర'మయ్యారు. రాజ్‌నారాయణ్ వంటి వ్యక్తి చేతుల్లో ఆమె తన సొంత నియోజకవర్గంలోనే ఓడిపోయారు.

నేడు 'అవినీతి' తప్పదు-అని భావిస్తున్నాం. అది ప్రతిచోటా ఉంది. కాని అది తప్పనిసరికాదు- అని మీరు గుర్తించిన నాడు, దాన్ని 'దుర్భరం'గా భావిస్తారు, ఆ పరిస్థితి మారుతుంది.

నాలుగవ సూత్రం: బెర్నార్డ్ చెప్పినది. ప్రస్తుత పరిమితులకు మీరు సర్దుకుపోతే ఏదీ మారదు. గాంధీ మహాత్ముడుగా ఎలా అయ్యాడో మనందరికీ తెలిసిందే.

మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ అనే ఆయన దక్షిణాఫ్రికా రైలులో మొదటితరగతి టిక్కెట్‌పై ప్రయాణిస్తూండగా, రాత్రివేళ బయటకు నెట్టివేశారు. అప్పటిదాకా నల్లజాతి లాయర్లెవరూ మొదటి తరగతిలో ప్రయాణం చేయలేదు. అది శ్వేతజాతీయుల పాలన. కాని గాంధీమాత్రం "నాకు మొదటి తరగతి టిక్కెట్ ఉంది. మొదటి తరగతిలో ప్రయాణించే హక్కు ఉంది" అని చెప్పాడు. దక్షిణాఫ్రికాలోని ఆ రైల్వే ప్లాట్‌ఫారంపై ఆ రోజురాత్రే గాంధీ మనస్సులో 'సత్యాగ్రహోద్యమం' రూపుదిద్దుకుంది. అది ఎంతమార్పు తెచ్చింది? అది సాధ్యమని మీరు నమ్మితే-సాధ్యమయ్యే తీరుతుంది.

ఇక చివరిగా, దీన్ని సాధించడం ఎలా అనే ప్రశ్న! అది ఎలాగో మైకెలాంజెలో చెప్పాడు. ఆయన ఒక శిల్పి. ఏ రూపం లేని పాలరాతికి మీరు ఎలా రూపం కల్పిస్తారు అని ఆయనను అడిగారు. "ఒక పాలరాతిని చూడగానే -నామనసులో ఒక శిల్పం రూపుదిద్దుకుంటుంది. ఇక-ఆ శిల్పానికి అవసరంలేని భాగాలను రాతిలోంచి తొలగిస్తాను. అంటే-శిల్పం తయారవుతుంది" అని ఆయన చెప్పాడు. అందువల్ల, నావ్యూహం-వందమంది, వెయ్యిమందితో కూడిన పథకం కాదు. మాకెలింజిలో, లేదా అలెక్సిడిటోకియవెల్లిల విధానాన్ని అనుసరిస్తే ప్రజల మనసులు మారి ఒక మార్పుకి దారితీస్తుంది.

ప్ర: సమీప భవిష్యత్తులో నిజాయితీపరులు రాజకీయరంగంలో ప్రవేశించే అవకాశం ఉందంటారా? రాజకీయాలల్లోకి

నిజాయితీపరులు ప్రవేశించేలా మనం ఎలా ప్రోత్సహించాలి?

జ: నేటి రాజకీయాలలో నిజాయితీపరుల్ని కూడా మీరు చూడవచ్చు. అరుణ్‌శౌరి, అరుణ్‌జైట్లీ వంటి నిజాయితీపరులు రాజకీయాల్లో ఉన్నారు. రాజకీయాల్లో ప్రవేశించకపోతే మీరు ఏం చేసేవారు-అన్న ప్రశ్నకు 90 శాతంమందికి సమాధానమే లేదు. ఎందుకంటే ఇంతకు మించిన జీవనోపాధి వారికి మరొకటి లేదు. స్వతంత్ర జీవనోపాధికల వారు ఎవరూ రాజకీయాలలో ప్రవేశించడం అనేది భారతదేశంలో లోపించింది. వారు రాజకీయాలలో రాగల ఏకైక మార్గం-రాజ్యసభ ఎన్నికలు. నేను పేర్కొన్న పారదర్శక పద్ధతులు నెలకొంటే భవిష్యత్తులో మరింత నిజాయితీపరులు రాజకీయాలోకి వచ్చే అవకాశం ఉంది.

ఉదాహరణకి ఆంధ్రప్రదేశ్‌లో , నాకంటే 20 ఏళ్ళు చిన్నవాడయిన డాక్టర్ జయప్రకాష్ నారాయణ్ అనే మాజీ ఐఎఎస్ అధికారి, ఒక శక్తివంతమైన ఉద్యమం నడుపుతున్నారు. సివిల్ సర్వీస్‌లో 20 ఏళ్ళు పనిచేసిన అనంతరం ఆయన రాజీనామా చేసి, లోక్‌సత్తా అనే ప్రభుత్వేతర సంస్థను స్థాపించి ఎన్నో మార్పులు తేగలుగుతున్నారు. ఎన్నికల సంస్కరణ విషయంలో ఎంతో చురుకుగా స్పందిస్తున్నారు. అందువల్ల డాక్టర్ జయప్రకాష్ నారాయణ్ వంటివారు రాజకీయాలలోకి రావడం నేను చూస్తాను.

నిజాయితీపరులు రాజకీయాలోకి రావడాన్ని మనం ఎలా పెంపొందించగలం? రాజకీయాలలో నల్లధనం ప్రభావాన్ని తగ్గించడం ద్వారా, నేరస్థుల ప్రవేశాన్ని అడ్డుకోవడం ద్వారా మనం ఆ పని చేయగలుగుతాము. ఇది ఒక్కసారిగా జరిగేది కాదు, క్రమంగా జరగవలసిన ప్రక్రియ.

ప్ర: అవినీతి ఒక 'సామాజిక కందెన' వలె సానుకూల పాత్ర వహిస్తుంది-అన్న అభిప్రాయంపై మీ వ్యాఖ్యానం ఏమిటి? న్యాయ రక్షణ రంగాలలో అవినీతి గురించి వ్యాఖ్యానించండి. విద్య, వ్యవసాయం మొదలయిన లక్ష్యాలలో అవినీతి స్థానం ఏమిటి?

జ: 'సామాజిక కందెనగా అవినీతి పాత్ర' అనేది కూడా ఒక అభిప్రాయంగా ఉంది. ఆ కథ చాలా సార్లు చెప్పాను. 94 ఫిబ్రవరిలో బ్యాంకాక్ వెళ్ళాను. అక్కడ నాకు చెప్పారు- థాయ్‌లాండ్‌లో అవినీతి ఉంది, ఇండియాలో అవినీతి ఉంది. కాని థాయ్‌లాండ్‌లో అవినీతి నిజాయితీ గల అవినీతి కాగా ఇండియాలో నిజాయితీ లేని అవినీతి. 'నిజాయితీ గల అవినీతి' అనేది ఎలా ఉంటుంది. ఇది-'శాఖాహార పులి' అన్నట్టు ఉంది. థాయ్‌లాండ్‌లో మీరు ప్రతిదానికి లంచం ఇవ్వాలి. లంచం ఇస్తే పని జరుగుతుంది. ఒకవేళ జరగకపోతే మీరు ఇచ్చిన లంచం తిరిగి ఇచ్చేస్తారు. కాని ఇండియాలో-మీరు లంచం ఇచ్చినా గాని పని జరగదు, ఇచ్చిన లంచమూ వెనక్కిరాదు. అంటే నిజాయితీలేని అవినీతి అన్నమాట! అవినీతి వాడే పదం కూడా 'గ్రీజు' ఇంజనీరింగ్ ఉదాహరణనే చూడండి-చక్రాలు తిరగడం ఆగిపోతే, గ్రీజు వాటిని తిరిగేలా చేస్తుంది. అయినా గాని అవినీతి ఒక రుగ్మతేనని చెప్పడానికి మనవద్ద ఎంతో సమాచారం, సాక్ష్యాలూ ఉన్నాయి. అవినీతి ఒక రుగ్మత అని చెప్పడానికి మూడు కారణాలున్నాయి. అవి: అవినీతి ఆర్థికాభివృద్ధికి, పేద ప్రజలకి, దేశానికి వ్యతిరేకం! అవినీతిని మనం ఎందుకు చట్టబద్ధం చేయకూడదు-అని కొందరు అడుగుతారు. ఇండియా నుంచి అవినీతి నిర్మూలించడం ఎలా అని బాబురాల్ పటేల్‌ను అడిగారు. అప్పుడు ఆయన దాన్ని మీరు అవినీతి అని ఎందుకు అంటున్నారు. 'సేవాఛార్జీలు అని పిలవండి. ఇంక అప్పుడు అసలు సమస్యే ఉండదు" అన్నారు.

ఆ పని విపిసింగ్ ప్రయోగించి చూశారు. కస్టమ్స్ అధికారులు స్మగ్లర్లకు ఎందుకు సాయపడుతారు? ఎందుచేతనంటే వారికి స్మగ్లర్లు డబ్బు ఇస్తారు కాబట్టి! అందువల్ల విపిసింగ్ వారు స్మగ్లింగ్ వస్తువులు జప్తుచేసినప్పుడు, సంబంధిత అధికారికి అందులో పెద్దవాటా ఇవ్వమని చెప్పారు. కాని ఆ ప్రయోగం విజయవంతం కాలేదనే అనుకొంటాను. ఎందుకంటే, స్మగ్లర్లు కస్టమ్స్ అధికారులకు ప్రభుత్వం ఇచ్చే దానికంటే ఎక్కువ డబ్బే ఇస్తారు. నేను మాట్లాడేది కేవలం కస్టమ్స్‌లోని అవినీతి అధికారుల గురించి మాత్రమే. నిజాయితీ పరులైన కస్టమ్స్ అధికారులు కూడా ఉన్నారు. వారు అందరూ అవినీతి పరులేనని ప్రజలు భావించరాదు.

న్యాయ, రక్షణ రంగాలలో అవినీతి గురించి: నాలుగు అంశాలను అధ్యయనం చేయమని ఫెర్నాండెజ్ నాకు చెప్పారు. ఒకటి, 1989 ఏప్రియల్ 17న రక్షణ ఆయుధాల కొనుగోళ్ళలో మధ్యవర్తులు ఉండరాదని నిర్ణయించింది. ప్రతి ఒప్పందంలో మధ్యవర్తులున్నారని రాజ్యసభ సభ్యుడు జయంత్ మల్హోత్రా ఆరోపించారు. అందువల్ల, మధ్యవర్తులు ఉన్నారో లేరో తెలుసుకోమని నన్ను అడిగారు. ఇక చూడండి, మధ్యవర్తులు ఉంటే వారు మేం మధ్యవర్తులం, మేం ఇది తీసుకొంటున్నాం-అంటూ అందుకు తగిన రికార్డు ఫైళ్ళలో వదలి పెడతారా? అయినా నా నివేదిక ఇచ్చాను.

దురదృష్టవశాత్తు అది ఒక రహస్య నివేదిక. ఎందుకంటే నేను 520 రహస్య ఫైళ్ళను పరిశీలించాను. అందుకని నీ నివేదిక కూడా రహస్య పత్రమే అవుతుంది. నా నివేదికలో సమాచారమంతా రహస్య, అతి రహస్య ఫైళ్ళపై ఆధారపడినందున దానిని రహస్య నివేదికగా పేర్కొన్నాను. కాని ప్రభుత్వం కూడా అలానే వర్గీకరించకపోవచ్చు. అయితే ఈ మొత్తం వ్యవహారంలో లోక్‌సభలో చర్చకు వచ్చింది. అయినా ప్రభుత్వం నివేదికను విడుదల చేయలేదు.

అందువల్ల, రక్షణ గురించి ఉన్న ప్రధాన సమస్య ఇదీ! తెహల్కా ఉదంతం అందరికీ తెలిసినదే. రక్షణరంగంలోని కొన్ని విభాగాలలో ఎంతో అవినీతి నిండిపోయింది. రక్షణ రంగంలోని అవినీతి వల్ల వచ్చే భయంకరమైన ప్రమాదం మన భద్రత మీదకంటే సైనికుల నైతికత మీద ఇంకా ఎక్కువ ఉంటుంది. కార్గిల్ యుద్ధంలో ఎందరో ప్రాణాలు కోల్పోయారు. నేను ప్రాణాలు ఇస్తున్నది దేశంకోసంకాదు ఈ మధ్యవర్తుల నుంచి లబ్ధిపొందే వారి గురించే- అని జవాన్లు భావించడమే జరిగితే వారి ఆత్మస్థైర్యం ఎంత దెబ్బతింటుంది? ఈ కారణంవల్లే ప్రభుత్వం నా నివేదికను విడుదల చెయ్యలేదేమో, నాకు తెలియదు.

విద్య, వ్యవసాయం మొదలైన ఎంచుకున్న లక్ష్యాల గురించి, నేను రిటైర్ కావడానికి కొంచెం ముందే, ది టైమ్స్ ఆఫ్ ఇండియా మన దేశాన్ని ఎదుర్కొంటున్న అతిపెద్ద సమస్య ఏమిటన్న విషయమై ఒక సర్వే నిర్వహించింది. ఆ సర్వే 'అవినీతే' మొట్టమొదటి సమస్య అని తేల్చింది. ఆ తర్వాతే విద్య మొదలయినవి ఉన్నాయి.

ప్ర: రాజకీయాలు మొత్తమంతా అవినీతిమయమై పోయాయని, రాజకీయాలను వృత్తిగా ఎంచుకోరాదనీ భావించే యువతరాన్ని మనం తప్పు పట్టరాదంటారా చెప్పండి?

జ: నిజానికి భారతదేశానికి గల బలాలలో యువతరం ఒకటి! విద్యార్థి నాయకులుగా ఉన్నా అరుణ్‌జైట్లీ వంటి కొందరు రాజకీయాలలోకి వచ్చారు. అలాగే లాలూప్రసాద్ యాదవ్ కూడా జయప్రకాష్ నారాయణ్ వలెనే విద్యార్థి నాయకుడు. ఆయనకూడా రాజకీయాల్లోకి వచ్చారు. విద్యావంతులైనవారు కూడా క్రమంగా రాజకీయాల్లోకి వస్తున్నారు. ఆయా వ్యక్తుల ఎదుగుదల మీద ఆధారపడి ఉంటుంది. నిజాయితీపరులైన నిపుణులు కూడా రాజకీయాలలోకి రాగలిగిన వాతావరణాన్ని మనం నెలకొల్ప గలిగిననాడు అనేకమంది విద్యార్థులు రాజకీయాలలోకి వచ్చి మన దేశానికి గొప్ప నాయకత్వాన్ని అందించగలుగుతారు.

ప్ర: ప్రభుత్వం పన్నుల రూపంలో భారీ మొత్తాలు వసూలు చేస్తోంది. తాము చెల్లించిన పన్నుల ద్వారా లభిస్తున్న ఫలితాలేమిటో తెలుసుకొనే హక్కు ప్రజలకు ఉంటుంది. పన్నుల వినియోగంలో పారదర్శకత ఎందుకు ఉండటం లేదు? అలా ఉంటే వాటిని వినియోగించడంలో అవినీతి స్థాయి ఎంత ఉందో ప్రజలకు తెలుస్తుంది కదా?

జ: బడ్జెట్‌ను ప్రవేశపెట్టడం, దానిపై చర్చించడం కూడా పన్ను చెల్లింపుదారుల ధనం ఏ ఖాతాలకింద ఎంతెంత ఎలా ఖర్చు అవుతుందో తెలిపే పారదర్శకత ప్రకటనే. అయితే పన్ను చెల్లింపుదారులకు తెలియని విషయం ఏమంటే, నిజంగా అవసరమైన వారికి ఎంత చెందుతుందో అనేది. మీరు పేదలకు ఇవ్వాలనుకున్న ప్రతి ఐదు రూపాయలో కేవలం 15 పైసలు మాత్రమే వారికి చేరుతున్నాయని రాజీవ్‌గాంధీ చెప్పారు.

ప్ర: వివిధ ధృవపత్రాలకోసం ప్రభుత్వోద్యోగులకు చెల్లించాల్సిన లంచాలనుంచి సామాన్యులను రక్షించడానికి మీవద్ద ఏదైనా మార్గం ఉందా?

జ: నేను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి ఈ విషయమే చెబుతున్నాను. ప్రతిదానికి మీరు ధృవపత్రాలు తెమ్మని ఎందుకు అడుగుతున్నారు? మొత్తం ప్రజలందరికి గుర్తింపు కార్డులవంటివి ఇవ్వవచ్చు. వాటిలోనే ఆ వ్యక్తి కులం, ఆర్థిక హోదా, మొదలైన వన్నీ ఉండాలి. అప్పుడు ఇంక ఎలాంటి పత్రాలు అడగవలసిన అవసరం ఉండదు.

ప్ర: మనం మెరిట్‌పద్ధతి పాటించడం లేదు అని మీరు భావించడం లేదా? మీ డెమొక్రసీ అవినీతికి దారితీస్తోంది?

జ: నేను పూర్తిగా మీతో ఏకీభవిస్తున్నాను. నెపోటిజం గురించి కూడా మరో ప్రశ్న వచ్చింది. దురదృష్టవశాత్తు మనదేశంలో అదికూడా మరో సమస్య అయింది. అందువల్ల రిజర్వేషన్ల విషయంలో ఒక ఆమోదయోగ్యమైన నిర్ణయం తీసుకోవడం అవసరం. వేలాది సంవత్సరాల నుంచి సమాజంలోని కొన్ని వర్గాలు దోపిడీకి గురయ్యాయి. వారికి న్యాయం జరగలేదు. అలాగే ప్రతిభను సత్కరించడానికి మార్గం ఏమిటో కూడా మనం కనుగొనాలి. వాస్తవానికి 'విద్యలో నాల్గవ స్రవంతి' అనే విధానాన్ని సూచిస్తున్నాను.

ప్ర: ఎలక్షన్లలో ఒకపార్టీ మరోపార్టీనో, సంఘటననో బలపరచడం, ఆ తర్వాత మానుకోవడం జరుగుతోంది. దీనికి భవిష్యత్‌లో ఏదయినా పరిష్కారం లభిస్తుందా?

జ: రాజకీయాల తీరే ఇది. రాజకీయాలను మనం నియంత్రించలేము. ప్రజాస్వామ్యమనుగడ అనే మొత్తం ప్రక్రియను అమలు చేయడాన్ని మనం నేర్చుకుంటున్నాం. కాలానుగుణంగా మన వైఖరి మెరుగుపడుతూ ఉంటుంది. ఒకే ఒక పార్టీ (కాంగ్రెస్) మొత్తం ఏలుకునే పరిస్థితి ఒకప్పుడు ఉండేది. ఇప్పుడు మనం సంకీర్ణాల వ్యవస్థను ఏర్పాటు చేసుకుంటున్నాం. గత ఐదు సంవత్సరాలుగా 24 పార్టీలు పరిపాలించడం అనేది ఒక అద్భుతం. అందుకు ప్రధాన కారకుడయిన అటల్‌జీకి ధన్యవాదాలు తెలపాలి. మన రాజకీయ నాయకులు రాజీ పడటం, ఐక్యంగా పనిచేయడం నేర్చుకుంటున్నారు.

ప్ర: రాజకీయాలు, రాజకీయవేత్తలు నేరమయం కావడం గురించి వాటిని నియంత్రించడం గురించి మీరు చెప్పారు. కాని, ఓటు వేసే వారికి కొన్ని కనీస విద్యార్హతలు ఉండాలి. అంటే, భారతీయులకు వయోజన ఓటింగ్‌హక్కు అవసరమా? వారికి ప్రజాస్వామ్యమంటే ఏమిటో నిజంగా అర్థం చేసుకోగలరా?

జ: కొన్నివేల సంవత్సరాలక్రితం, సోక్రటీస్ చెప్పాడని ప్లేటో పేర్కొన్న విధంగా-నా చెప్పులు బాగుచేసుకోవాలనుకున్నప్పుడు, చెప్పులు బాగుచెయ్యడం ఎలాగో తెలిసిన వాడిదగ్గరకు వెడతాను, దుస్తులు కుట్టించుకోవాలనుకున్నప్పుడు-ఆ పని ఎలా చెయ్యాలో తెలిసిన దర్జీవాని వద్దకు వెడతాను. ఒక దేశాన్ని పరిపాలించడానికి మాత్రం అలాంటి అర్హతలను వేటినీ మనం చూడడం లేదు. రెండువేల సంవత్సరాల క్రితం గ్రీస్‌లో ఏ పరిస్థితి ఉందో, నేడు మనకీ అదే పరిస్థితి ఉంది.

మన నాయకులు సాహసవంతమైన నిర్ణయం తీసుకుని సార్వత్రిక వయోజన ఓటింగు కల్పించి న్యాయం చేశారు. మార్పులు తేగలిగినది ఈ నిరక్షరాస్యుల ఓటింగు మెజారిటీయే. ఎమర్జన్సీని ఎలా ఎదుర్కొన్నారో తెలిసినదే. అవకాశం రాగానే ఇందిరాగాంధీని తొలగించారు. అదే విధంగా అనేక ప్రభుత్వాలు మారడం మనం చూస్తున్నాం. అంతేకాదు, 73, 74 సవరణల వల్ల అనేకమంది మహిళలు పంచాయితీలలోకి వస్తున్నారు. మొదట్లో మహిళా సర్పంచ్‌లపై వారి భర్తల పెత్తనం ఉండేది. కాని ఇప్పుడు మహిళలే



# రైతాంగానికి సహాయం... పెరిగిన రుణ సదుపాయం



మన రాష్ట్రంలోని గ్రామీణ, వ్యవసాయ రంగాలు నిలకడగా అభివృద్ధిని సాధించాలంటే సమర్థమైన పరపతి విధానం చాలా అవసరం. ప్రస్తుత సరళీకృత ఆర్థిక విధానాలు మన గ్రామీణ పరపతి సంస్థలను తీవ్రంగా ప్రభావితం చేస్తున్నాయి. అందువల్ల వీటికి అనుగుణంగా మన విధానంలో మార్పులు తీసుకొని రావాలి. వ్యవసాయ రంగంలోని ఉత్పత్తికీ, పెట్టుబడులకూ, వెన్నుదన్నుగా నిలిచే పరపతి విధానాన్ని రూపొందించుకుని, గ్రామీణ పరపతి సంస్థలను బలోపేతం చేయాలి.

## పెరిగిన రుణ సహాయం

రాష్ట్రంలో చిన్నతరహా, మధ్యతరహా రైతులు వ్యవసాయ రుణాల అవసరాలు ఇంకా తీరాల్సి ఉన్నా ఈ తరుణంలో రాష్ట్ర ప్రభుత్వం అనేక చర్యలు చేపట్టింది. 2003-2004 ఆర్థిక సంవత్సరంతో సరిపోల్చి చూస్తే 2004-2005 సంవత్సరానికి గాను పంట రుణాలను 41.78 శాతానికి, కాలావధి రుణాల్లో 147.41 శాతానికి పెంచింది. ఈ ఏడాది ఖరీఫ్ కాలానికి కేటాయించిన 7,500 కోట్ల రూపాయలలోని ఆగస్టు 25 నాటికి 5,066 కోట్ల రూపాయలను పంపిణీ చేసింది. గత సంవత్సరంతో సరిపోల్చి చూస్తే ఇది 1161 కోట్ల రూపాయలు ఎక్కువ.

## ప్రభుత్వం చేపట్టిన చర్యలు

మన రాష్ట్రంలోని గరిష్ఠ సంఖ్యలోని రైతులను రుణ సహాయం అందేందుకు రాష్ట్ర ప్రభుత్వం సత్వర ఆదేశాలు జారీచేసింది. అవి సక్రమంగా అమలు జరిగేందుకు వ్యవసాయ శాఖలోని యంత్రాంగం చురుగ్గా వ్యవహరిస్తోంది.

- పట్టాదారు పాసుపుస్తకాలు లేవన్న కారణంతో రుణాలు పొందలేకపోతున్న రైతులకు ప్రత్యామ్నాయ ఏర్పాట్ల ద్వారా సహాయం అందించాలని జిల్లా కలెక్టర్లకు ఆదేశాలు జారీ అయ్యాయి.
- ఈ విషయమై రాష్ట్ర వ్యవసాయ శాఖ, బ్యాంకులు విస్తృత ప్రచారాన్ని నిర్వహిస్తున్నాయి.
- ఇంతవరకు గ్రామీణ పరపతికి నోచుకోని రైతుల జాబితాను రూపొందించాలని, ఆ జాబితాలోని రైతులకు గ్రామీణ పరపతి సంస్థల ద్వారా రుణాలు అందేలా చూడాలని జిల్లా కలెక్టర్ల పర్యవేక్షణలో ప్రభుత్వ యంత్రాంగం పెద్దఎత్తున కృషి చేస్తోంది. ఇప్పటివరకు 13.56 లక్షల రైతులు ఆ జాబితాలో చోటు చేసుకున్నారు. ఒక్కో బ్యాంకూ ఇప్పుడు ఉన్న సంఖ్యకు అదనంగా నూరుగురు రైతులకు రుణలివ్వాలని ప్రతిపాదనలు వెళ్లాయి. ఈ ఏడాది కనీసం 4.90 లక్షల మంది అదనపు రైతులకు 1345 కోట్ల రూపాయల రుణాలు బ్యాంకుల ద్వారా అందజేయబడతాయి.
- నాబార్డ్ రూపొందించిన మార్గదర్శక సూత్రాల సహాయంతో విశాఖపట్నం, గుంటూరు, అనంతపురం, కడప, నిజామాబాద్, మహబూబ్‌నగర్ జిల్లాల్లోని 6000 రైతు మిత్రా గ్రూపులను రుణ సహాయం కోసం గుర్తించడం జరిగింది. వివిధ బ్యాంకులు, వాటి శాఖలు చిన్నతరహా, మధ్యతరహా రైతులకు రుణాలను పంపిణీ చేస్తున్నాయి.
- అన్ని రకాల పంటలకూ పూర్తిస్థాయి పరపతి లభించేలా జిల్లా కలెక్టర్లు, జేడీయేలు, బ్యాంకు అధికారులు కృషి చేస్తున్నారు.

## కరువు బారినపడ్డ రైతులకు బకాయిలపై ఊరట

- ఇంతవరకు రైతులు బకాయిపడ్డ అసలు, వడ్డీలను 2004 మార్చి 31 నాటి అసలు మొత్తంతో కలిపి, దీన్ని ప్రస్తుతం అమలులో ఉన్న వడ్డీ రేట్లలో అయిదు సాంవత్సరిక వాయిదాల్లో రైతులు చెల్లించేందుకు ప్రభుత్వం వీలు కల్పించింది.
- గతంలో బకాయిలు ఉన్న రైతులకు కొత్త రుణాలు అందేలా నాబార్డ్ మార్గదర్శక సూత్రాలను వెలువరించింది.
- క్షామపీడిత బడుగు రైతులకు తోడ్పడేందుకు స్వల్పకాలిక రుణాలతో అసలు మొత్తాన్ని మధ్యకాలిక రుణాలుగా మార్చడం జరిగింది. చిన్న, మధ్యతరహా రైతులు తమ స్వల్పకాలిక రుణాలపై చెల్లించాల్సిన వడ్డీలను ప్రస్తుతానికి వాయిదావేసి, రాబోయే పంట కాలంలో చెల్లించేలా ఏర్పాట్లు చేయడం జరిగింది. వీటికి చక్రవడ్డీ వర్తించకపోవడం గమనించాల్సిన విషయం.
- పరపతిని అవసరాలకు అనుగుణంగా పొందేందుకు వీలుగా బ్యాంకులు కిసాన్ క్రెడిట్ కార్డులను రైతులకు అందజేస్తున్నాయి. ప్రస్తుతం 56.6 లక్షల మందికే ఇవి అందుబాటులో ఉన్నాయి. ఇంకా 43.4 లక్షల మంది రైతులకు వీటిని అందించేందుకు బ్యాంకులు కృషి చేస్తున్నాయి.
- 5.85 లక్షల రైతులు చెల్లించాల్సిన 1417 కోట్ల రూపాయల పంట రుణాలను మధ్యకాలిక రుణాలుగా మార్చడం జరిగింది.

జారీచేయువారు : సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్.

RNI Regn. No. APTEL/2003/11482

**PRINTED BOOK**

Postal Regn. No. LII/RNP/H-HD-1029/2004-06



సమర్ధతను పెంపొందించుకుంటున్నారని తెలుస్తోంది. అందువల్ల, ఒక బాధ్యతాయుతమైన మార్గంలో స్వపరిపాలనను సాధించడం ఎంతో మంచిది. భారతదేశం 100% అక్షరాన్యత సాధిస్తే ఆదర్శవంతంగా ఉంటుంది. అయితే, సుదీర్ఘ భవిష్యత్తు రీత్యాగాని, స్వాతంత్ర్యం రీత్యాగాని చూస్తే, ప్రస్తుతం మనకున్న విధానమే అత్యుత్తమమని చెప్పగలను. ప్రజాస్వామ్యంలో ఉన్న మహిమ ఏమిటి? వ్యక్తులకు ఆత్మ గౌరవాన్ని ప్రసాదించడమే.

ప్ర: ప్రస్తుత పరిస్థితుల్లో లంచాలు ఇవ్వకుండా ఉండగలమా?

జ: తమిళనాడుకు గవర్నర్‌గా పనిచేసిన శ్రీప్రకాశ్ "నేను లంచం ముట్టను' అని ప్రతిజ్ఞ చేయగలను. కాని 'లంచాలు ఇవ్వను' అని మాత్రం ప్రతిజ్ఞ చేయలేను" అన్నారు. ప్రస్తుత పరిస్థితులలో అలాంటి ప్రతిజ్ఞ చేయడం కష్టమనే అనుకుంటున్నాను. కాని లంచాలు ఇవ్వకుండా జీవించడం సాధ్యమే. తమిళనాడులోని ఎన్నో బృందాలు అలా ఉండేందుకు ప్రయత్నిస్తున్నాయి. అయితే ఎవరికివారు సొంతంగా అలాంటి నిర్ణయం తీసుకోవాలి.

ప్ర: అవినీతిపై వ్యవహారజ్ఞానం యొక్క ప్రభావం ఏమిటి?

జ: ఈ ప్రశ్నకి సమాధానం ఎలాగయినా చెప్పవచ్చు. 'వ్యవహారజ్ఞానం' అనేపదం వాడితే, అవినీతిని ఒక వాస్తవంగా గుర్తిస్తూ, దాంతో జీవించడానికే ప్రయత్నిస్తున్నట్లవుతుంది. అది తప్పు! 'వ్యవహారజ్ఞానం' అంటే అవినీతిని అరికట్టడమనే అర్థాన్ని నేను తీసుకుంటాను.

నేను సివిసిగా వున్న గత నాలుగేళ్ళలో అవలంబించినది అదే! ఇంకా అది సాధ్యం కూడా. 'వ్యవహారజ్ఞానం' అనే పదానికి అర్థాన్ని మీరు కూడా తీసుకుంటే-దాన్ని అరికట్టడం సాధ్యమేనని మీకూ అనిపిస్తుంది.

ప్ర: మంత్రులు పదవీ బాధ్యతలు చేపట్టే సమయంలో రహస్యాలు కాపాడతామని ప్రమాణం చేస్తారు గాని, అందుకు బదులుగా పారదర్శకత పాటిస్తాం-అని ఎందుకు ప్రమాణం చెయ్యరు?

జ: సమాచార చట్టం వంటి చట్టాల ద్వారా పారదర్శకతను సాధించాలి. కాని, ప్రతి ప్రభుత్వమూ ఎన్నో సున్నితమైన సమస్యలతో వ్యవహరించవలసి ఉన్నందువల్ల 'రహస్యం' అవసరమవుతుంది. రక్షణ, ఉగ్రవాదం తదితర విషయాలలో ప్రతి ఒక్కటీ, ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలని మనం అనుకోము. ప్రతి ఒక్కటీ బయటపడితే ఎంతో ప్రమాదం. అందువల్ల పరిపాలనాపరంగా కొన్ని విషయాలను రహస్యంగా ఉంచడం అవసరమవుతుంది.

ప్ర: మన ఆర్థిక వ్యవస్థ కుప్పకూలేలోగా అవినీతిని అరికట్టడం సాధ్యమని మీరు భావిస్తున్నారా?

జ: అవును. అలాగే అనుకుంటున్నాను. నేటి నా సందేశం మొత్తం అంతా అదే కూడా! ఆర్థిక వ్యవస్థ విచ్ఛిన్నం కాదు. 2050 నాటికల్లా మనదేశం సంపన్నవంతంగా తయారవుతుందని ప్రతి ఒక్కరూ చెబుతున్నారు. మన ఆర్థిక వ్యవస్థ వర్ధిల్లబోతున్నది. మనం అవినీతిని సమర్థవంతంగా అరికట్టగలమనే భావిస్తున్నాను.

ప్ర: రాజకీయనాయకులకు తక్కువ ఆదాయం రావడం వల్లే అవినీతి వైపు మొగ్గుతున్నారని మీరు భావిస్తున్నారా? వీరి ఆదాయాన్ని పెంచితే? కొన్ని వేల రూపాయలు ఖర్చయినా కొన్ని కోట్ల రూపాయల్ని కాపాడుకోవచ్చు!

జ: ఇది మంచి ఆలోచనే!

ప్ర: మనదేశం లాలూప్రసాద్ వంటి రాజకీయ నాయకుల్ని నిరవధికంగా ఉత్పత్తి చేస్తోంది. అది ఇప్పుడు పతాకస్థాయికి చేరిందని భావిస్తారా?

జ: మీలాంటి వారంతా, లాలూప్రసాద్‌ని ఆయన ఏదో బీహార్‌కి నష్టం చేసినట్టు ఎందుకు మాట్లాడతారు? లాలూయాదవ్ అధికారంలోకి వచ్చినపుడు, ఆయన ఒక విషయాన్ని వెలుగులోకి తెచ్చారు. ఇంగ్లీషు చదువుకున్న మనలాంటి నగరవాసులు ఎయిర్ కండిషన్ గదుల్లో కూచుని, బీహారు ప్రజలంతా అభివృద్ధి లోపించడం వల్లే బాధపడుతున్నారనుకుంటాం. కాని 'మాకు అభివృద్ధి కాదు, ఆత్మ గౌరవం కావాలి' అని లాలూప్రసాద్ చెప్పారు.

కులతత్వం బలంగా ఉన్న బీహార్ వంటి రాష్ట్రంలో, బలహీన వర్గాల కోర్కెను లాలూ వ్యక్తీకరించారు. అందుకే ఆయన మళ్ళీ మళ్ళీ ఎన్నికవుతున్నారు. బీహార్ ప్రజలందరూ తెలివితక్కువ వాళ్ళను కుంటున్నారా? లేకపోతే ఇన్ని సమస్యల్ని లాలూ ఎలా ఎదుర్కొంటున్నారు? అందువల్ల మనం సామాజిక వాస్తవికతలను గుర్తించాలి.

ప్ర: అవినీతి ప్రజాస్వామ్యంలో ఎక్కువా, నియంతృత్వంలో ఎక్కువా?

జ: ప్రజాస్వామ్యంలో అది బహిర్గతం. నియంతృత్వంలో అంతర్గతం, గుర్తించలేము.



*Owned, Printed and Published by V.Hanumantha Rao at D.No.8-3-898/22, Road No.3, Nagarjuna Nagar, Hyderabad-5000 073 Ph: 23748672, DTP at Samata Graphics, Hyderabad. Printed at Akruti, Chikkadapalli, Hyderabad. Editor: V.Hanumantha Rao*

VEEKSHANAM
TELUGU FORTNIGHTLY
1070, NAGARJUNA NAGAR
HYDERABAD-500073